
PARLE
Ram and Shyam
POPPINS
Doon Kya?
ఏంజిల్ ఇబ్బందిలో పడ్డారు.
ఇప్పుడు ఏంజిల్ రామ్ ఇంకా శ్యామ్‌ల 'గాంగ్'తో కలిసిపోయింది. పెద్ద అబ్బాయిలు జాగ్రత్త. వాళ్ళు చెడు పనులు చేస్తే, భయం లేని ఈ త్రిమూర్తులని ఎదుర్కోవాలి. వాళ్ళు దృఢమైన వారు, ధైర్యస్థులు మరియు కలిసి ఉన్నారు.


ఆ తంత్రపు ఏంజిల్‌కు ఓ పాఠం నేర్పించాలి. నా ప్రత్యేక మాగ్నెటిక్ రిమోట్ కంట్రోల్, మాగ్నెటిక్స్‌తో, ఆ స్పేస్‌షిప్ నా వద్దకు వచ్చేలా చేసుకుంతాను.
హహహహ


ఈలోగా...
మాకు సాయపడుతున్నందుకు ధన్య వాదాలు ఏంజిల్.
పర్వాలేదు మనం అంతా ఒక టీమ్. నేను త్వరలోనే మళ్ళీ వస్తాను,
త్వరగా వచ్చెయ్, మిత్రమా..


ఉన్నట్టుండి ఏంజిల్ మరియు ఆమె స్పేస్‌షిప్ మాయం అయ్యింది.
ఊఊ...లేదు. ఆమె ఎక్కడికి వెళ్ళింది?
బహుశా డా. మీన్, అతని లాబ్‌కి వెళ్దాం పద. ఆమె అక్కడే ఉండచ్చు.


డా. మీన్ ఏంజిల్‌ని ఆమె సొంత స్పేస్‌షిప్‌లోనే కట్టి పడేసాడు.
హహహ్హా ఇప్పుడు నీ మిత్రులు ఏం చేస్తారు? నీ ప్లానెట్‌లోకి వెళ్ళి నా స్పెషల్ రీసెర్చ్‌ని నిర్వహిస్తాను.


రామ్ మరియు శ్యామ్ డా.మీన్ లాబ్‌కి చేరుకున్నారు. అక్కడ స్పేస్‌షిప్‌ని చూసారు.
బహుశా ఇది బయలుదేరడానికి సిద్ధంగా ఉంది.
ఈ ఫ్యూయెల్ టాంక్‌ని పాపిన్స్‌తో నింపేద్దాం.
FUEL TANK


రామ్ మరియు శ్యామ్ స్పేస్‌షిప్ యొక్క ఫ్యూయెల్ టాంక్‌ని పాపిన్స్‌తో నింపేసారు.


స్పేస్‌షిప్ డిస్కోగా, రాత్రి పూట వెలుగులతో మారిపోతుంది.
ఏం జరుగుతోంది?


డా.మీన్ ఏం జరుగుతోంది చూడటానికి బయటకి వచ్చాడు, రామ్ మరియు శ్యామ్ స్పేస్‌షిప్‌లోకి ప్రవేశించారు.
హే శ్యామ్, ఏంజిల్ రండి, మనం ఎగిరిపోదాం...


డా.మీన్ జరిగిన మోసాన్ని తెలుసుకున్నాడు.
అరె... ఈసారి వాళ్ళని పట్టుకోవాలి.
POPPINS

# యువ విజేతలు

## సనీకా వివేక్ దివేకర్



సనీకా వివేక్ దివేకర్ మహారాష్ట్రలోని థానేకి చెందిన 13 ఏళ్ల అమ్మాయి. తను బ్రాహ్మణ విద్యాలయలో చదువుతూ, ప్రొఫెషనల్ టేబుల్ టెన్నిస్ క్లబ్ తరపున ఆడుతోంది.

ఈమె 2006లో థానేలోని ప్రొఫెషనల్ టేబుల్ టెన్నిస్ క్లబ్‌లో చేరింది. ఆమె కోచ్ శైలజా గోహడ్ తన ప్రతిభా పాటవాలను గమనించి ఆమె పట్ల జాగ్రత్త తీసుకున్నారు.

సనీకా ప్రతిరోజు 6 గంటలపాటు కఠోర శిక్షణ పొందుతోంది. రోజువారీ అభ్యాసానికి, టోర్నీలలో పాల్గొనడానికి బాగా శక్తి అవసరం. దేశం కోసం ఆడాలని సనీకా ప్రయత్నిస్తోంది. తన శిక్షణలో భాగంగా యోగా సెషన్లలో కూడా ఈమె పాల్గొంటోంది.

మానసిక శక్తిని, వ్యక్తిత్వాన్ని పెంచి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే క్రీడల్లో ప్రతి చిన్నారీ తప్పక పాల్గొనాలని సనీకా భావిస్తోంది.

యువపాఠకులకు ఆమె ఇచ్చే సందేశం ఒక్కటే.. ''ఆటలు ఆడండి. పెద్ద కలలు కనండి, మీకోసం, మీ తల్లితండ్రుల కోసం, మీ పాఠశాలకోసం, మీ స్నేహితుల కోసం మీరు కష్టించి పనిచేయండి.''

ఈనెల ఉదయతార సనీకా దివేకర్‌కి చందమామ శుభాకాంక్షలు.

**విజయాలు:**

- సబ్ జూనియర్ కేటగిరీలో టేబుల్ టెన్నిస్‌లో ప్రస్తుతం భారత్‌లో 3వ స్థానం.
- 2007లో జాతీయ క్రీడల్లో కంచుపతకం
- 2007లో మహాబలేశ్వర్‌లో జరిగిన స్టేట్ ఛాంపియన్ షిప్‌లో కేడెట్ గర్ల్ సింగిల్స్ టైటిల్ గెల్చుకుంది.
- 2007లో మహారాష్ట్ర, ఐరోలిలో జరిగిన కేడెట్ గర్ల్స్ సింగిల్స్ ఛాంపియన్‌షిప్ గెల్చుకుంది.
- 2008లో మహారాష్ట్ర, పూనేలో జరిగిన సబ్ జూనియర్ స్టేట్ ఛాంపియన్‌షిప్‌లో టీమ్ ఈవెంట్‌లో స్వర్ణపతకం సాధించింది.

# ఈ సంచికలో ...



చందమామ సంపుటి: 64 మార్చ్ 2011 సంచిక: 03














**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

ప్రియ మిత్రులారా!!!

మార్చ్ నెలకు స్వాగతం. ఈ నెల ప్రత్యేకమైనది. హోలీ, ఫైనల్ పరీక్షల రూపంలో ఈ నెల సరదా, తీవ్ర శ్రమల మేలు కలయికగా ఉంటుంది. మన జీవితాలను సరదా మరియు కఠిన శ్రమ రెండింటితో సమతుల్యం చేసుకోవాలనే నిజాన్ని ఇది మనకు నొక్కి చెబుతుంది. మతపరంగా చూస్తే మహాశివరాత్రి ఈ నెలలోనే వస్తోంది. దేశవ్యాప్తంగా హిందువులకు ఇది చాలా ముఖ్యమైన పండుగ.

చందమామ రూపొందించనున్న పలు డిజిటల్ ఉత్పత్తులను మేము ఇదివరకే సూచించి ఉన్నాము. దీంట్లో భాగంగా, మా యువ పాఠకులకోసం ఒక కొత్త 3డి. కామిక్ పుస్తకం తీసుకొస్తున్నాము. ఇది నిజంగా మనకు ఒక కొత్త అనుభవం. ఇంగ్లీషు, హిందీ, సంస్కృతంలో ఆడియో కథలు కూడా త్వరలో విడుదల కానున్నాయి. వీటిపై మరిన్ని వివరాలు త్వరలో తెలుపగలము. ఇంకా టెలివిజన్ కోసం మేము మొబి సోడ్స్ మరియు యానిమేషన్ సీరియల్స్‌ని కూడా ప్రారంభించాము. వీటి వివరాలను కూడా అతి త్వరలో మీకు తెలుపగలము.

పదే పదే చెబుతున్నట్లుగా మీ విలువైన అభిప్రాయాలు మాకెంతో అవసరం. నిజాయితీతో కూడిన మీ అభిప్రాయాలను మేం గౌరవిస్తున్నాము. ఈలోగా ఈనెల కథల నిధి మీకోసం సిద్ధమైంది చూడండి.

– సంపాదకులు




మార్చ్ 2011 ₹20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**Content Head - Online :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Subhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.
Published and Printed on their behalf by Prashant Sharad Muleker
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Shruti Art Pvt. Ltd. Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai-400010.
Editor :- Prashant Sharad Mulekar




# పాఠకుల లేఖలు





జనవరి సంచికతో చందమామకు గ్రహణం కొంచెం తొలిగినట్లయింది. కానీ గత సెప్టెంబర్‌కి ముందు చందమామ సైజులోనే ఉంది. చందమామకు గ్రహణం పూర్తిగా తొలుగుతుందని ఆశించవచ్చా! – 'రచన' శాయి, హైదరాబాద్

చందమామ మా సాంస్కృతిక వారసత్వం. భవిష్యత్తులో ధర పెంచినా పత్రికను కొనకుండా ఉండలేము. కాని ముద్రణ నాణ్యతను మాత్రం తగ్గించకండి. చందమామ పదికాలాలపాటు వర్ధిల్లాలి. – ఆకాంక్ష, హైదరాబాద్

చందమామలో కథలు, బొమ్మలు గురించి చెప్పపనిలేదు. జి.కె, పజిల్స్, జోక్స్ మా చందమామలోనే ఎందుకు? వాటికి ఇతర పుస్తకాలు చాలానే ఉన్నాయి కదా! వీటివల్ల మంచి కథలు తగ్గిపోతున్నాయి. మునుపటిలా పూర్తిగా కథలతో, పూర్తి వర్ణచిత్రాలతో 4 పుటల సీరియల్స్‌ని ప్రచురించండి. – వెంకటేష్, ముషీరాబాద్

చందమామలో ఎన్నో కథలతో బాటు చిన్ని కథలు ప్రచురిస్తున్నందుకు సంతోషం. 80 ఏళ్ల మాబోటి వారు ఏ సంచికా వదలకుండా చదివింపజేసే శక్తి చందమామకున్నది. పాత చిత్రకారుడు శ్రీ ఎంటీవీ ఆచార్య గారు వేసిన శ్రీకృష్ణలీల ముఖచిత్రం ముగ్ధమనోహరంగా ఉంది.
– బొడ్డపాటి రాజేశ్వరమూర్తి, చిలకలపూడి, కృష్ణాజిల్లా

శ్రీ మూర్తిగారూ! మీ వంటి పెద్దలు, పెద్దల్లాంటి పిల్లల ఆదరణే చందమామకు తొలినుంచి ఊపిరి పోస్తోంది. తదుపరి ఉత్తరంలో మీ ఫోన్ లేదా మొబైల్ నంబర్ రాసి పంపండి. మీ చందమామ జ్ఞాపకాలు మీ ఫోటోతో సహా అవసరం. 80 సంవత్సరాల వయస్సులోనూ చందమామను చదువుతూ సూచనలందిస్తున్నారు. మీకు కృతజ్ఞతలు మరియు నిండు నూరేళ్లు. – సంపాదకులు

feedback@chandamama.com

**Visit us at : http://telugu.chandamama.com**

# అసలు రహస్యం

భూమయ్య అనే ఒక యాభై ఏళ్ళ వ్యవసాయ దారుడికి, ఒక్క సింగుపాలెం గ్రామంలోనే కాక, ఆ చుట్టు పక్కల వున్న గ్రామాల్లో కూడా చాలా తెలివైన వాడనీ, వివేకి అనీ మంచి పేరున్నది. ఆయన ఇరవై ఏళ్ళ యువకుడిగా, కేవలం కట్టుబట్టలతో ఎక్కడి నుంచో, ఆ గ్రామం వచ్చి పదెకరాల పొలం, ఇతరత్రా కొన్ని ఆస్తి పాస్తులు సంపాయించాడు.

ఒకనాటి సాయంవేళ భూమయ్య గ్రామ చెరువు గట్టునవున్న మర్రిచెట్టు కింద కూర్చుని, చెరువులో ఈదుతున్న బాతుల్నీ, చెరువు నీళ్ళ పైన ఎగురుతున్న కొంగల్నీ చూస్తూ ఆనందిస్తూండగా, ఇద్దరు యువ కులు అక్కడికి వచ్చి, ఆయన పక్కనే కూర్చున్నారు.

కొంతసేపు ఏదో పిచ్చాపాటీ మాట్లాడాక యువ కుల్లో ఒకడు, ''మావయ్యా, నిన్నొక ప్రశ్న అడగాలను కుంటున్నాను,'' అన్నాడు.

భూమయ్య చిరునవ్వు నవ్వి, ''అలాగే అడుగు. నువ్వు పెద్దవాళ్ళను ప్రశ్నలడిగి మంచీ, చెడూ తెలుసు కోవలసిన వయసు వాడివిగదా!'' అన్నాడు.

''మావయ్యా, ఎప్పుడో నువ్వీ గ్రామం వచ్చినప్పుడు, డబ్బున్న వాడివేం కాదని గ్రామంలో చెప్పుకుంటారు. మరిప్పుడేమో గ్రామంలో వున్న కొద్ది మంది ఆస్తిపరుల్లో నువ్వొకడివి. ఇంత ఆస్తి ఎలా సంపాదించావు? దాని వెనకవున్న రహస్యమేంటి?'' అడిగాడు యువకుడు.

ఆ ప్రశ్నకు భూమయ్య ఆప్యాయంగా యువకుడి భుజం తట్టి, ''మాది సత్య కాలం నాయనా. ఓర్పూ, కృషీ, పట్టుదలా, నిజాయితీ, నేర్పూ-ఇదీ అసలు రహస్యం! ఆస్తి సంపాదనకు అడ్డుదారులు లేవు!'' అంటూ పెద్దగా నవ్వాడు.


Statement about Ownership of
**CHANDAMAMA (Telugu)**
Rule 8 (Form VI), Newspaper (Central) Rules, 1956

1. **Place of Publication:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
2. **Periodicity of Publication:**
MONTHLY
1st of each calendar month
3. **Printer's Name:**
Prashant Sharad Mulekar
**Nationality:**
Indian
**Address:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
4. **Publisher Name:**
Prashant Sharad Mulekar
**Nationality:**
Indian
**Address:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
5. **Editor's Name:**
Prashant Sharad Mulekar
**Nationality:**
Indian
**Address:**
Chandamama India Ltd.,
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.
6. **Name and address of Individuals who own the newspaper:**
Chandamama India Ltd.,
Board of Directors:
1. Prashant Sharad Mulekar
2. Kiran Kulkarni
3. Salim Govani
B-3, Cross Road 'B', MIDC,
Andheri (East), Mumbai-400093.

I **Prashant Sharad Mulekar**, do hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd.) **Prashant Sharad Mulekar**
Publisher

1st March 2011

**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children above 4 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior (Only in English)

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex :....................................

Address: .......................................................................................

.....................................................................................................

.....................................................................................................

................................................ City: ....................................

State:......................................... Pin:.......................................

Telephone:....................................................................................

Mobile:.........................................................................................

Email:...........................................................................................

Subscription Number (for renewals):...............................................

Gift Subscription to the following address:

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

.....................................................................................................

Enclosed Cheque/DD* for Rupees...................................................

Cheque/DD No ..............................................................................

favouring Chandamama India Ltd on...............................................

...........................................................................................bank.

* Your subscription will commence in 6 weeks.
Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093.
Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# స్వేచ్ఛ

గురు గోవింద్ సింగ్ అనే సైనికుడొకడు యుద్ధ ఖైదీగా పది సంవత్సరాలు శత్రు చెరసాలలో ఉండి విడుదలై తన స్వగ్రామానికి వెళుతూ దారిలో, ఒకతను పక్షులను బంధించి పంజరాలలో అమ్ముతున్న దుకాణానికి వెళ్ళాడు.

''అయ్యా నీ వద్దనున్న అన్ని పక్షులను ఎంత వెలకు అమ్ముతావు?'' అని అడిగాడు సైనికుడు దుకాణాదారుణ్ణి.

''ఒక వంద రూపాయలు!''

గురుగోవింద్ సింగ్ తన వద్దనున్న వంద రూపాయలను ఇచ్చి అన్ని పక్షులను కొనేశాడు.

వెంటనే పంజరాల తలుపులు తెరచి అన్ని పక్షుల్నీ పంజరాల నుంచి వదిలివేశాడు. అవి గంతులేసుకుంటూ ఆకాశంలోకి ఎగిరిపోయాయి. పంజరాలను సైనికుడు నేలపడేసి ధ్వంసం చేశాడు.

దుకాణదారుడు ఈ వింత ప్రవర్తనను చూసి నవ్వుతూ.. ''నీకు పిచ్చి పట్టిందా? డబ్బిచ్చి కొన్న పక్షులను అలా వదిలేశావు'' అన్నాడు.

''నాకేమి పిచ్చి లేదు. నేను పదేండ్లు శత్రు చెరసాలలో బందీగా ఉండి విడుదలై ఇప్పుడే మా గ్రామానికి వెళ్తున్నాను. బందీగా ఉండి స్వేచ్ఛగా బయటకు రావడంలో ఎంత సంతోషం ఉన్నది నాకు తెలుసు. ఆ పక్షులూ అంతేగా! చూడండి. అవి ఎంత సంతోషంగా ఆకాశంలో విహరిస్తున్నాయో'' అని తానూ గంతులు వేస్తూ, నవ్వుతూ, నాట్యం చేస్తూ తన స్వగ్రామంవైపు వెళ్ళిపోయాడా సైనికుడు. - కోలార్ కృష్ణ అయ్యర్



# బాధ్యత

గోపాలపురంలో, విశ్వరూపుడనే వణిక్ ప్రముఖుడుండేవాడు. అతడు, తరతరాలనుండి వస్తున్న వ్యాపారాన్ని, తన హయాంలో కూడా వృద్ధి చేశాడు. అతడి, ఒక్కగానొక్క కొడుకు కుమారగుప్తుడు పెద్దవాడయి, అన్నిటికీ అందివచ్చాడు.

కుమారగుప్తుడు, తండ్రిలాగే నైపుణ్యశాలి. కానీ ఏ పనీ బాధ్యతగా చేసేవాడు కాదు. అతడికి అప్పగించిన పనులేవీ సక్రమంగా పూర్తయ్యేవి కాదు.

విశ్వరూపుడు, ఎంత బోధించినా, కుమారగుప్తుడు బాధ్యతను అలవర్చుకోలేక పోయాడు. వ్యాపారం, తన తదనంతరం ఏమవుతుందోనని తండ్రి బెంగపెట్టుకున్నాడు.

ఒకనాడు, తండ్రీ కొడుకులు వ్యాపారం పనిమీద పక్కవూరు వెళ్లి, గుర్రపుబగ్గీ మీద తిరిగి వస్తుంటే, పొలిమేరల్లో గారడీ జరుగుతోంది.

గారడీ యువతి, అంతెత్తు కర్రల మీద కట్టిన తీగమీద లాఘవంగా నడుస్తోంది. రెండుచేతుల్లో పొడవాటి వెదురుకర్ర అడ్డంగా పట్టుకుని, తూకం సరిచూసుకుంటూ అడుగులేస్తోంది.

కుమారగుప్తుడు, దాన్ని అబ్బురపాటుగా చూస్తూ, ''నాన్నగారూ! ఆమె చేతిలో వెదురుబొంగే ఆమె చాతుర్యానికి మూలం!'' అన్నాడు ఉత్సాహంగా.

''బాధ్యత కూడా ఆ కర్రలాంటిదే నాయనా! బాధ్యత మోయని మనిషి, జీవితంలో తూకం తప్పుతాడు,'' అన్నాడు విశ్వరూపుడు. తన పొరపాటు గ్రహించిన కుమార గుప్తుడు, ప్రతిపనిలోనూ బాధ్యత వహించి, తండ్రిని మించిన వర్తకుడయ్యాడు.

– భీమవరపు పురుషోత్తం



## బేతాళ కథలు

# స్వప్న వృక్షం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, 'రాజా! నీవెవరయిందీ, ఎందుకు ఇంత శ్రమపడుతున్నదీ నాకు తెలియదుగానీ, నీ పనిని ఇతరులు అపార్థం చేసుకునే ప్రమాదముంది. మేలు చేయ గోరినప్పటికీ, కారాగారం పాలై, అదృష్ట వశాత్తూ బయటపడిన శివచరణుడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను' అంటూ ఇలా చెప్పసాగాడు.

స్వర్ణధార రాజ్యంలో ధర్మదాసు అనే రైతు ఉండేవాడు. అతనికి శివచరణుడు ఒక్కగా నొక్క కొడుకు. వాడు పుట్టినప్పుడు జాతకం చూసిన జ్యోతిష్కుడు ''వీడికి రాజయోగం ఉంది,'' అని చెప్పాడు. ధర్మదాసు, తన కొడుకుకు మంచి చదువు చెప్పించడానికి అరుణాచలంలోని జితేంద్రుడనే ముని దగ్గర వదిలి వచ్చాడు. శివచరణుడు చదువు లోనే కాక, నడవడికలో కూడా మిన్నగా



ఉండి పేరు పొందాడు. అతడికి యుక్త వయసు వచ్చాక ఒక రోజు జితేంద్రుడు చేర బిలిచి ''నాయనా! నీ విద్యాభ్యాసం ముగిసింది. నీకు ఉజ్వల భవిష్యత్తు ఉంది. నీకు నా ఆశీస్సులు. వెళ్లిరా,'' అని చెప్పాడు.

శివచరణుడు, గురువు పాదాలకు నమస్కరించి తల్లిదండ్రుల వద్దకు బయలుదేరాడు. కొద్ది రోజుల తరవాత ఒక ప్రాంతం చేరిన అతనికి అద్భుతమైన దివ్య పరిమళం సోకింది. అది ఎక్కడినుంచి వస్తున్నదో తెలుసుకోవడానికి ముందుకు సాగాడు.

అతనికి ఒక మహావృక్షం కనిపించింది. దానికి ఒకే రకం పుష్పాలు లేవు. వివిధ పరిణామాల్లో వివిధ రకాలుగా ఉన్నాయి. ఆ వృక్షం నీడన నడుం వాల్చాడు. అతనికి వెనువెంటనే నిద్ర పట్టేసింది. నిద్రలో అతనికో స్వప్నం వచ్చింది. శివచరణుడు ఒక సభలో ఆసీనుడై ఉన్నాడు. సభికులందరూ జయ జయధ్వానాలు పలుకుతున్నారు. అతని మీద కాసుల వర్షం కురుస్తున్నది. పండితులు అతడికి పల్లకీ కట్టారు.

మెలకువ వచ్చిన శివచరణుడు అలాంటి సత్కారం జరగాలని తన మనసులో ఏదో మూల ఉండి ఉంటుంది. అదే స్వప్నరూపం దాల్చింది, అని భావించి నవ్వుకున్నాడు. అక్కడి నుంచి బయలుదేరే ముందు ఆ వృక్షం తాలూకు పుష్పాలు కొన్ని మూట గట్టుకున్నాడు. ఊరు చేరిన శివచరణుడు ఉద్యోగ ప్రయత్నం చేశాడు. కానీ అది ఫలించలేదు. తను తెచ్చిన వింత పుష్పాలు వాడిపోకుండా అలాగే తాజాగా ఉండటం గమనించిన శివచరణుడు అది దేవవృక్షం అని నిర్ధారించుకున్నాడు.

ఒక రోజు జమీందారు గోవర్ధన గిరి భూషణుడు కవిత్వం పోటీలు నిర్వహిస్తున్నట్లు చాటింపువేశారు. చాలామంది ఉత్సాహం చూపించారు. మిత్రులు అతణ్ణి పోటీకి వెళ్లమని ప్రోత్సహించారు.

అతడా పోటీకి హాజరయ్యాడు. ఎందరో పండితులు వచ్చి కవిత్వం చెప్పారు. శివచరణుడు తన వంతుగా కవిత్వం పూర్తి చేసే సరికి పండితులు అతని ప్రతిభకు నివ్వెరపోయి కరతాళధ్వనులు చేశారు. జమీందారు శివచరణుణ్ణి హృదయానికి హత్తుకుని ఘనంగా సత్కరించాడు. బంగారు కాసులు కానుకగా ఇచ్చి పల్లకీలో ఇంటికి సాగనంపాడు.

ఆనాడు మహావృక్షం కింద నిదురించినప్పుడు వచ్చిన స్వప్నం ఇలా నిజం కావడం గమనించి శివచరణుడు ఆశ్చర్యపోయాడు. దీర్ఘంగా ఆలోచించిన శివచరణుడు ఆ వృక్షానికి అటువంటి మహత్తు ఉంటే ఆ వృక్షం తాలూకు పుష్పాలకు కూడా అటువంటి మహత్తు ఉండి ఉండాలని భావించి కొన్ని పుష్పాలను తలకింద పెట్టుకుని నిద్రించాడు.

ఆ రాత్రి అతనికో స్వప్నం వచ్చింది. జమీందారు మనుష్యులు వచ్చి శివచరణుడిని అతని సమక్షానికి తీసుకుపోయారు. జమీందారు శివచరణుడికి తన దివాణంలో ఉద్యోగం ప్రకటించాడు.

తెల్లవారింది. శివచరణుడు తనకొచ్చిన స్వప్నం మననం చేసుకుని అది నిజం అవుతుందో లేదో చూద్దామని భావించాడు.

నెలగడిచింది. జమీందారు నుంచి ఎటువంటి వర్తమానం అందలేదు. శివచరణుడు మొదటి స్వప్నం నిజం కావడం యాదృచ్ఛికం అని భావిస్తుండగా, జమీందారు కబురు చేసి, తన దివాణంలో ఉద్యోగం ఇచ్చి, మంచి జీతం ఇచ్చాడు.

దీనితో ఆ వృక్షానికి నిజంగానే మహత్తు ఉందని, ఆ చెట్టు కింద పడుకున్నప్పుడు గాని, ఆ పుష్పాలను తలకింద పెట్టుకుని పడుకున్నప్పుడు గాని, వచ్చిన స్వప్నాలు నిజం అవుతాయని రూఢి అయింది. దీంతో అతనా వృక్షానికి స్వప్న వృక్షం అని పేరు పెట్టాడు.

ఆ రాజ్యాన్నేలే రాజు మహేంద్రపాలుడు ధార్మికుడు. ప్రజాబంధువు. మాసానికోసారి ప్రజాదర్బారు పెట్టి రాజ్య సంక్షేమానికి ప్రజలనుంచి సూచనలు కోరేవాడు.





స్వప్నంలో యువరాణి చందనవీణ, శివ చరణుడి మెడలో వరమాల వేస్తూ కనిపించింది. మెలకువ వచ్చిన తర్వాత మహేంద్ర హేళుడు ఆ వింతస్వప్నానికి నివ్వెరపోయాడు. మరునాడు రాజు, శివచరణుణ్ణి రప్పించి, 'నీవు అందజేసిన పుష్పాలు తలకింద పెట్టుకుని రాత్రి నిద్రించాను. స్వప్నంలో యువ రాణి చెలికత్తె నీ మెడలో వరమాల వేసింది,' అని చెప్పాడు. అది విన్న శివచరణుడు నవ్వుతూ 'మహారాజా, ఆ స్వప్నం తప్పక నిజం అవుతుంది,' అన్నాడు.

అప్పుడు మహేంద్రహేళుడు, 'నీకు అబద్ధం చెప్పాను. నిజానికి స్వప్నంలో నీ మెడలో వరమాల వేసింది చెలికత్తె కాదు, యువరాణి!' అని చెప్పాడు.

తనకు తెలిసిన స్వప్నవృక్షం వృత్తాంతం బహిరంగపరిస్తే అది రాజుకి ఉపయోగపడ గలదని శివచరణుడు భావించి స్వప్నవృక్షం పుష్పాలు కొన్ని తీసుకుని పోయి, రాజుని కలిశాడు. స్వప్నవృక్షం కింద పడుకున్నప్పుడు వచ్చిన స్వప్నాలు నిజం కావడం గురించి చెప్పి, 'ఈ సమాచారం మీకు ఏ రకంగా అయినా ఉపయోగపడగలదేమో చూడండి,' అని తాను తెచ్చిన పుష్పాలు అందచేశాడు. మహేంద్రహేళుడు, ఆ పుష్పాలు స్వీకరించి శివచరణుడు ఆ రాత్రంతా ఉండటానికి బస ఏర్పాటు చేశాడు. ఆ రాత్రి మహేంద్రహేళుడు, శివచరణుడు అందించిన పుష్పాలు తలకింద పెట్టుకుని హంస తూలికాతల్పం మీద నిద్రించాడు. అప్పుడతనికొక స్వప్నం వచ్చింది.

అది విన్న శివచరణుడు ఇరుకునపడ్డాడు. ఆ స్వప్నం నిజం అవుతుంది అంటే మహారాజు తనను అత్యాశపరుడిగా భావించి శిక్షిస్తాడు. అది నిజం కాదు అంటే అంత వరకు తాను చెప్పింది కట్టుకథగా భావించి తన విలువైన సమయం హరించినందుకు శిక్షిస్తాడు. ఎలాగైనా శిక్ష తప్పదని భావించిన శివచరణుడు 'మహారాజా! యువ రాణి ఎక్కడ? నేనెక్కడ? నాకా అర్హత లేదు. నేను స్వప్నవృక్షం గురించి మీకు తెలియ పరచడంలో ముఖ్యోద్దేశం అది మీకు ఏ రకంగానైనా ఉపయోగపడుతుందేమో అన్న సదుద్దేశమే గాని, నాకు వేరే ఆలోచన లేదు.' అని మనవి చేశాడు.

అప్పుడు మహేంద్రహేళుడు 'చూడబోతే నీవు మంత్రతంత్రాలు నేర్చిన తాంత్రికు

డిలా ఉన్నావు. తాంత్రిక శక్తులతో పుష్పాలకు పూజలు చేసి, అవి నాకిచ్చి, నాకు అల్లుడివైనట్లు కల రప్పించి మాయ చేయాలని చూశావు. నిన్ను ఉపేక్షించను,' అని శివచరణుడిని కారాగారంలో పెట్టించాడు. శివచరణుడు తనకు పట్టిన దుస్థితికి చింతించాడు. మహారాజును కలిసి పెద్ద తప్పు చేసినట్లు భావించాడు.

నెలరోజులు గడిచాయి. వృద్ధాప్యం మీద పడిన మహేంద్రహేళుడు వారసుడి ఎంపిక చేయదలిచాడు. రాజ్యాచారం ప్రకారం పట్టపుటేనుగు ఎవరిమెడలో పూల హారం వేస్తే వారు ఏలిక అవుతారు.

మహారాజు అందుకు సమయం వచ్చిందని భావించి చాటింపు వేయించాడు. ఒక శుభముహూర్తాన పట్టపుటేనుగుకు పూల దండ అందించి వీధిలోకి పంపారు.

కొత్త రాజు ఎంపిక కాబోతున్న శుభ సందర్భాన కారాగారవాసులందరికీ రాజు స్వేచ్ఛ ప్రకటించాడు. శివచరణుడు కారాగారం నుంచి బయటకు వస్తుండగా, పట్టపుటేనుగు సరాసరి అతని వద్దకు వచ్చి మెడలో పూలహారం వేసింది. ప్రజలు జయ జయధ్వానాలు చేశారు.

స్వర్ణధార రాజ్యం సర్వసైన్యాధ్యక్షుడు శివచరణుడి ముందు మోకరిల్లి, 'ఈ క్షణం నుంచి మీరు మహారాజు. మీరే ఆజ్ఞ విధించినా శిరసావహిస్తాను,' అన్నాడు. శివచరణుడు నేరుగా మహారాజు వద్దకు పోయి, 'మహారాజా, మిమ్మల్ని అపార్థం చేసుకున్నాను. క్షమించండి,' అని ఆయన పాదాలు



తాకాడు. మహారాజు శివచరణుడిని పైకి లేపి, హృదయానికి హత్తుకుని 'నాయనా, పట్టపుటేనుగు నీ మెడలో హారం వేసినప్పుడు రాజపీఠానికి నీవు తగిన వాడివా, కాదా అన్న చిన్న సందేహం మదిలో మెదిలింది. నీ విజ్ఞత చూశాక, ఆ సందేహం తీరిపోయింది. ఈ రాజ్యంతో పాటు, నా కుమార్తెను కూడా చేపట్టి రాజ్యపాలన గావించు.' అన్నాడు. శివచరణుడు సంతోషంగా సమ్మతించాడు.

అంతవరకు కథ చెప్పిన బేతాళుడు, 'రాజా మంచిఉద్దేశ్యంతో వచ్చిన శివచరణుడిని తాంత్రికుడిగా భావించి చెరలో పెట్టించాడు. మహేంద్రహేళుడు. అవకాశం కలిసి వచ్చి, శివచరణుడు మహారాజయ్యాడు. సర్వసైన్యాధ్యక్షుడే అతనేం చెప్పినా చేస్తానని మోకరిల్లాడు. కానీ శివచరణుడు మహేంద్ర

హేళుడిని ఉరితీయించి ప్రతీకారం తీర్చుకోకుండా అపార్థం చేసుకున్నందుకు మన్నించమని ఎందుకు పాదాభివందనం చేశాడు? మహేంద్రహేళుడు, శివచరణుడిని విజ్ఞుడని ఎందుకు స్తుతించాడు? యువరాణికి నేను తగను అన్న శివచరణుడు ఆమెతో వివాహానికి ఎందుకు సమ్మతించాడు?' అని ప్రశ్నించాడు.

అది విన్న విక్రమార్కుడు, 'బేతాళా! శివచరణుడు తనను కలవడానికి వచ్చినప్పుడే మహారాజు అతను ప్రజాక్షేమం కాంక్షించే మనస్తత్వం ఉన్నవాడని అర్థం చేసుకున్నాడు. జితేంద్రుడి శిష్యుడు శివచరణుడు చెప్పాడంటే ఆ వృక్షంలో తప్పక మహత్తు ఉండి ఉంటుందని భావించబట్టేమహేంద్రహేళుడు ఆ పుష్పాలను తల కింద పెట్టుకుని నిద్రించాడు. యువరాణి, శివచరణుడి మెడలో వరమాల వేసినట్లు స్వప్నం వచ్చినప్పుడే మహారాజు అది దైవనిర్ణయమని గ్రహించాడు.

శివచరణుడి సహనం పరీక్షించడానికే మహారాజు అతడిని కారాగారంలో పెట్టించాడు. స్వప్నం, సత్యం అవుతుందని నమ్మబట్టే పట్టపుటేనుగు పూలమాల వేసే రోజున శివచరణుడిని బయటకు రప్పించాడు. అదంతా అర్థం చేసుకున్నందునే శివచరణుడు, మహేంద్రహేళుడిని క్షమార్పణ కోరి పాదాభివందనం చేశాడు.

శివచరణుడు తనను అర్థం చేసుకోకపోతే శిక్షించే ప్రమాదం ఉందని మహేంద్రహేళుడు ఊహించాడు. అయితే శివచరణుడు అలా చేయక నిజం గ్రహించినందునే, మహారాజు అతడిని విజ్ఞుడని కొనియాడాడు. ఇక శివచరణుడు, యువరాణితో వివాహానికి సమ్మతించడానికి కారణం, ఇప్పుడతను సామాన్యుడు కాదు, మహారాజు. ఇప్పుడు అంతరాల సమస్యే లేదు. అందుకే పెళ్లికి సమ్మతించాడు.' అని సమాధానం చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో పాటు మాయమై తిరిగి చెట్టెక్కాడు. – కల్పితం

*[ఆధారం : శివనాగేశ్వరరావు]*



# చందమామతో నా జ్ఞాపకాలు

మా చందమామ ఒక పుస్తకం మాత్రమే కాదు.. మా జీవితంలో భాగం, చెరపలేని ఓ మధురాను భూతి. 1980మొదట్లో నాన్న ద్వారా చందమామ చదవడం అలవాటు అయ్యింది. విజయవాడ సత్యన్నారాయణపురంలో ఒక పురాతన గ్రంథాలయం వారు ఈ పుస్తకాలను అందుబాటులో ఉంచేవారు. మా నాన్నగారు కొనని పక్షంలో మేము అక్కడికి వెళ్ళి చదివే వాళ్ళం.

మా ఇంట్లో నేను చిన్నవాడిని. అన్నయ్య పేరు విజయ శ్యామకుమార్. నాన్న చందమామ తెచ్చినప్పుడల్లా ముందుగా చివరి పేజీలో వచ్చే రాము-శ్యాముల చిత్ర కథలను చదివి ఆనందించే వారము.. మా చుట్టాలు మమ్మల్ని రాము-శ్యాము గానే పలకరించే వారు.

ఒకే చందమామని ఇద్దరం ఒక్కసారే చదవాల్సి వచ్చినప్పుడు 'ప్రక్కప్రక్కనే కూర్చుని చదువుదాం, ఒక వేళ నేను ఈ పేజీ చదవడం పూర్తి అయిపోతే మరో పేజీని కొద్దిగా తీసి ఉంచు, నేను అవతలి పేజీలో చదువుకుంటాను నువ్వు ఇవతలి పేజీలోది చదువుకో,' అని ఇద్దరం ఓరకమైన రాజీకి వచ్చేవాళ్ళం.


Name: D. Chakravarthy
Occupation: Project lead, Redington, USA.

అవన్నీ మధురానుభూతులుగా మిగిలిపోయాయి. 'పండక్కి ఏమి కావాలి,' అని మా నాన్న అడిగితే 'చందమామ కావాలి' అని ఎన్ని సార్లు పేచీ పెట్టామో! 'చందమామని కొనిస్తాం, మరింకేం కావాలం'టే 'మరో చందమామ' అనే వాళ్ళమే కాని మరేమీ కావాలనే వాళ్ళం కాదు. అప్పట్లో మా మట్టి బుర్రకి చందమామ నెలకు ఒకసారే వస్తుందంటే అర్థం అయ్యేది కాదు.

ఉద్యోగంలో పెద్దవాళ్ళం అయ్యాం.. సమాజంలో ఓ స్థాయి వచ్చింది.. స్థాయికి అనుగుణంగా కొంచెం గంభీరంగా బ్రతకాలి.. అనే ముసుగులో బ్రతికేస్తున్న నాలాంటి వాళ్ళకు ఆ జ్ఞాపకాలే అమృత ధారలు. అలాంటి అమృతాన్ని అందించిన చందమామ నిజంగా ఈ తరానికే కాకుండా ఏతరానికైనా ఒక చక్కని బహుమతే అని నా అభిప్రాయం. మీరు ఇలాగే పది కాలాలపాటు పచ్చగా వర్ధిల్లుతూ ఉండాలనేది నా ప్రార్థన.

ఓ మంచి సంకల్పానికి నాంది పలికిన చందమామ ప్రారంభకులకు మరియు ఇప్పటిదాకా ఈ సంచికను నడిపిస్తూ ముందుకు తీసుకు వెళుతున్న తరతరాల యాజమాన్యానికి కృతజ్ఞతలు చెప్పకుండా ఉండలేకపోతున్నాను. ధన్య జీవులు మీరు.

చందమామ పత్రికతో మీ చిన్ననాటి అనుబంధం గురించి పాఠకులతో పంచుకుని, చందమామలో ప్రచురిం చాలనుకుంటున్నారా? దయచేసి మీ జ్ఞాపకాలు మాకు పంపండి. online@chandamama.com

(or)

Chandamama India Ltd; No:2 Ground Floor, Swathi Enclave,
Door No 5 & 6, Amman koil street, Vadapalani, Chennai-600026.
Phone: 044-43992828



# కామరాజు కోపం

కామరాజు అనే అతడికి కోపం ఎక్కువ. మాట్లాడితే చాలు ఎగిరెగిరి దుముకుతుంటాడు. అతడికి ఈ మధ్యనే పెళ్ళయింది. భార్య సుశాంతి కాపురానికి వచ్చిన మొదటి రోజున, అత్తవారింట్లోకి ముందుగా కుడి కాలు పెట్టి నడవమని అందరూ హెచ్చరిస్తున్నా, పరధ్యానంగా ఉండి ఎడమకాలు పెట్టింది.

కామరాజు అది చూసి కోపంతో మండిపడుతూ భార్య చెయ్యి పుచ్చుకుని విసురుగా వెనక్కులాగి, 'అంతమంది చెబుతున్నా వినవేం? ముందు కుడికాలు పెట్టు!' అన్నాడు ముఖం చిటమటలాడిస్తూ.

ఆ క్షణంలోనే సుశాంతికి తన భర్త అమిత కోపిష్టి అని తెలిసిపోయింది. తర్వాత ఇంట్లోని పళ్ళాలూ, చెంబులూ, లోటాలూ అక్కడక్కడా సొట్టలుపడి ఉండటం చూసి, అత్తగారు చెప్పకుండానే అదంతా తన భర్త ప్రతాపమని ఆమె గ్రహించింది.

ఇంట్లో తెల్లగా సున్నం వేసిన గోడలకు, అక్కడక్కడా పచ్చని మరకలూ, ఏవో కూరల మరకలూ పడివున్నవి.

ఒకనాడు వాటివంక పరిశీలనగా చూస్తున్న సుశాంతితో అత్తగారు, 'అవన్నీ కూరలూ అవీ రుచిగా లేనప్పుడు నీ భర్త పళ్ళెం విసిరివేసిన తాలూకు గుర్తులు!' అన్నది.

ఆ మాట విని ఆరేళ్ల ఆడపడుచు పకపకా నవ్వింది.

సుశాంతికి మాత్రం నవ్వు రాలేదు. తన భర్తకు అంత కోపం ఎందుకు వస్తుందో, ఆమెకు అర్థం కాలేదు. ఈ సంగతి ఒంటరిగా ఉన్నప్పుడు సుశాంతి భర్తను అడి

దాసరి వెంకటరమణ

గింది. కామరాజు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు తప్ప జవాబు చెప్పలేదు.

మంచి తెలివితేటలు గల సుశాంతి, ఏదైనా ఉపాయంతో భర్తలోని కోపాన్ని పోగొట్టాలని ఆలోచించింది. అందుకు కొంతకాలంపాటు తను ఎంతో అమాయకురాలిననే భ్రమ, భర్తకు కలగడం అవసరం అనిపించిందామెకు.

కామరాజుకు కోపం వచ్చినప్పుడు చాలా పరుషంగా మాట్లాడతాడు. ఆ గుణాన్ని ఆసరా చేసుకుని, అతడి కోపాన్ని ఎలాగైనా పోగొట్టాలని సుశాంతి నిర్ణయించుకుంది.

ఒకరోజు వీధిలోంచి ఇంట్లోకి వచ్చిన కామరాజు చాలా కోపంగా ఉన్నాడు. అతడు ఆ కోపాన్ని భార్యమీద చూపిస్తూ, 'పళ్ళెంలో నాలుగు మెతుకులు వేసి తీసుకురా. త్వరగా తిని తగలడాలి!' అన్నాడు.

సుశాంతి అలాగే తీసుకువచ్చి, పళ్ళెం అతడి ముందు పెట్టింది. కామరాజు ఆశ్చర్యపోతూ మరింత కోపంగా భార్యకేసి చూశాడు.

సుశాంతి అదేం గమనించకుండా, మరేదో పనిలో ఉన్నట్లు నటిస్తూ, 'అయినా, ఇదేం విడ్డూరమండీ! అంతా అదేదో కథల్లో విన్నట్టుగా ఉంది. నాలుగు మెతుకుల్తో మీకు ఆకలెలా తీరుతుంది?' అన్నది.

తన భార్య కావాలనే అలా చేసిందని, అంతవరకూ మండిపడుతున్న కామరాజుకు, భార్య మాటల వెనుకనున్న అమాయకత్వాన్ని గమనించేసరికి కోపం కాస్తా ఎగిరిపోయింది.

పెళ్ళయిన కొత్తలో తన భార్య అమాయకురాలే అనుకున్నాడు గానీ, మరీ ఇంత



అమాయకురాలనుకోలేదు కామరాజు. ఈ విధంగా రెండు మూడుసార్లు ఇలాంటి తరహా సంఘటనలే జరిగాయి. ఒకసారి బాగా కోపంమీద ఉన్న కామరాజు, వంట గదిలో ఉన్న భార్యను కేకవేసి, 'ఆ చేతి సంచి ఇలా తెచ్చి, నా మొహానకొట్టు. బజారుకుపోయి కూరగాయలు తెస్తాను,' అన్నాడు.

సుశాంతి సంచీ తెచ్చి, కామరాజు అన్నట్టుగానే చేసింది.

కామరాజు కోపంగా ఇదేమిటని అడిగితే, ఆమె అమాయకంగా... 'నాకేం తెలుసునండీ! బజారుకు వెళ్ళేముందు సంచీని భార్య అలా ముఖాన కొట్టడం, మీ ఇంటి ఆచారమేమో- అలా చేస్తే శుభం జరుగుతుంది కాబోలు,' అనుకున్నాను అన్నది.

కామరాజుకు ఏమని చెప్పాలో పాలుపోయింది కాదు.

ఒకసారి ఇంట్లోవాళ్ళందరూ పొరుగూళ్ళో పెళ్ళికి వెళ్ళారు. ఇంట్లో కామరాజూ, సుశాంతీ మాత్రమే ఉన్నారు. వసారాలో ఉన్న కుడితినీళ్ళ కుండ నిండిపోవడంతో, దానిని దూరంగా చెట్టుకింద ఉన్న కుడితిగాబులో పోద్దామని తెచ్చింది సుశాంతి.

అయితే దానిలో రాత్రి పోసిన నీళ్ళు ఆవు తాగకపోవడంతో, నిండుగా ఉంది. సుశాంతికి చూస్తూ, చూస్తూ కుడితినీళ్ళు పారబోయబుద్ధి కాలేదు.

కామరాజు పక్కనే ఉన్న వేపచెట్టు కింద కూర్చుని యోగాసనాలు వేస్తున్నాడు. సుశాంతి అతడికి సంగతి చెప్పి, కుడితి నీళ్ళను ఏం చేయాలని అడిగింది.



కామరాజు విసురుగా రెండు క్షణాలు భార్యవంక చూసి, 'నా నెత్తిన తెచ్చిపొయ్యి!' అని, పద్మాసనం వేసుకుని కళ్ళు మూసు కున్నాడు.

అలా అన్నదే తడవుగా సుశాంతి కుడితి నీళ్ళకుండను నిదానంగా ఎత్తి, కామరాజు తలమీద గుమ్మరించింది. కామరాజు బెంబేలెత్తిపోతూ శివమెత్తిన మనిషిలా లేచి, సుశాంతి చెంపమీద చెళ్ళున ఒక దెబ్బ వేశాడు. సుశాంతి ఆశ్చర్యంగా భర్తవంక చూసింది.

కామరాజు పట్టలేని కోపంతో బుస కొడుతూ, 'నీకసలు బుద్ధంటూ ఉన్నదా? ఏమిటి నువ్వు చేసినపని?' అని అడిగాడు సుశాంతిని.

సుశాంతి కళ్ళనీళ్ళు పెట్టుకుని, 'మీరే గదా పొయ్యమన్నారు! కుడితినీరు వృథా చెయ్యకుండా అలా తలమీద పోసుకో వడం, ఆరోగ్యానికేమైనా మంచిదేమో అను కున్నాను' అన్నది.

ఆ జవాబువిని కామరాజు గట్టిగా తల బాదుకుని కూలబడ్డాడు. కాసేపట్లో సుశాంతి పొడిబట్ట తెచ్చి అతడి వళ్ళంతా తుడుస్తూ, 'తప్పయితే నన్ను క్షమించండి!' అన్నది.

కామరాజుకు తన భార్య అమాయ కత్వంమీద చెప్పరానంత బాధ కలిగింది. అంతకుముందు జరిగిన సంఘటనల తాలూకు జ్ఞాపకాలు అతడు మరిచిపో లేదు.

అందువల్ల ఆనాటినుంచీ ఎప్పుడైనా కోపంవచ్చి బుద్ధి వశం తప్పి మాట పరు షంగా రాబోతూ ఉంటే, వెంటనే తమా యించుకునేవాడు.

ఇది గమనించిన సుశాంతి, అన్ని విష యాల్లోనూ భర్తకు అనుకూలంగా మసలు కుంటూ, అతడికేవిధంగానూ మనసు నొయ్యకుండా జాగ్రత్తపడుతూ వచ్చింది. క్రమంగా కామరాజు కోపం దానంతట అదే పోయింది.






# పెండ్లి సన్నాహం

"స్వామీ, ఇంతకాలానికి మామీద దయ కలిగింది. ఆజ్ఞాపించండి" అన్నాడు గరుత్మంతుడు.

"గరుడా! ఆకాశరాజు కూతురు పద్మావతితో మా వివాహం నిశ్చయమైంది. సత్యలోకానికి వెళ్ళు. మా పుత్రుడు బ్రహ్మను సకుటుంబంగా, సపరివారంగా రమ్మని మామాటగా చెప్పు" అన్నాడు శ్రీనివాసుడు.

"ఆజ్ఞ" అంటూ గరుత్మంతుడు ఆకాశంలోకి ఎగిరాడు.

ఆదిశేషుడు వినయంగా శ్రీనివాసుని వైపు చూశాడు. "స్వామీ! ఆజ్ఞాపించండి! పర్యంకసేవా?"

"కాదు ఆదిశేషా! నువ్వు వెంటనే కైలాసానికి వెళ్ళు. నాగభూషణుడైన పరమశివుణ్ణి దర్శించు. మా వివాహానికి ఆహ్వానించి, తీసుకురా! కైలాస కుటుంబమంతా ఆ రోజు ఇక్కడికి కదలి రావాలని విన్నవించు!" అన్నాడు శ్రీనివాసుడు.

ఆదిశేషుడు వినయంగా తల ఊపి బయలుదేరాడు.

"నాయనా, శ్రీనివాసా! అష్టదిక్పాలకులను మరచిపోయావు!" అంటూ గుర్తు చేసింది వకుళమాలిక.

"బ్రహ్మ అందరినీ వెంటబెట్టుకు వస్తాడమ్మా. సపరివారంగా రమ్మన్నాను కదా. దిక్పాలకులనూ, గంధర్వులనూ, కిన్నెరులనూ అందర్నీ తీసుకువస్తాడు." అంటూ బదులిచ్చాడు శ్రీనివాసుడు.

శ్రీనివాసుడు ఊహించినట్లుగానే బ్రహ్మ

వక్కలంతం సూర్యనారాయణ రావు

సమస్త దేవతలనూ వెంటబెట్టుకుని వేంక టాచలానికి వచ్చాడు. అందరూ బృందాలు, బృందాలుగా శ్రీనివాసుడికి నమస్కారాలు అర్పించారు. ఆయన అందర్నీ ఆప్యా యంగా పలుకరించాడు.

''కుమారా, ఈ సాధ్వి వకుళమాలిక. ఈ అవతారంలో ఇక్కడ నాకు తల్లి. కృష్ణా వతార సమయంలో యశోద'' అన్నాడు శ్రీనివాసుడు వకుళమాలికను పరిచయం చేస్తూ.

బ్రహ్మ ''పితామహికి ప్రణామాలు'' అంటూ వకుళమాతకు నమస్కరించాడు.

దేవతలమధ్య చేతులు జోడించి నిలు చున్న దేవశిల్పి విశ్వకర్మను తన సమీపానికి పిలిపించుకున్నాడు శ్రీనివాసుడు.

''విశ్వకర్మా, మా వివాహానికి దేవతలూ, మునులూ ఎందరు వచ్చారో చూశావు కదా! వాళ్లందరూ హాయిగా విడిది చేయడానికి అనువైన సౌకర్యాలు కలిగిన మందిరాన్ని ఇక్కడ నిర్మించు'' అన్నాడు విశ్వకర్మను ఆజ్ఞాపిస్తూ శ్రీనివాసుడు.

విశ్వకర్మ అతిథులందరూ విశ్రమించ డానికి వీలుగా సకల సదుపాయాలతో ఒక మందిరాన్ని తన సంకల్ప మంత్రంచేత నిర్మించాడు. దేవతలూ, ఋషులూ ఆ మందిరంలో విడిది చేశారు.

ఆ తరువాత శ్రీనివాసుడు అగ్ని దేవుడిని పిలిచి ''అగ్నిహోత్రా, నీ భార్యలయిన స్వాహాదేవి, స్వధాదేవి సహకారం తీసుకుని అతిథులు ఆరగించడానికి రుచికరమైన వంటలు వండు'' అన్నాడు.



అగ్ని అందుకు సమ్మతించాడు. శ్రీని వాసుడు అదే విధంగా కొందరు దేవపురుషు లను ఎంపికచేసి, వాళ్ళకు పనులు అప్ప గించాడు. అందరికీ నీళ్ళు అందివ్వడానికి వరుణుడిని నియమించాడు.

పరిమళ ద్రవ్యాలు సమకూర్చి, అంద రికీ పంచే పనిని వాయుదేవుడికి అప్పగిం చాడు. వంట సామగ్రినీ, నీటి పాత్రలను శుభ్రం చేసే పనికి నవగ్రహాలను నియ మించాడు.

శాస్త్రోక్త ప్రకారం వివాహసంబంధమైన ప్రాథమిక కార్యాలను నిర్వహించమని బ్రహ్మను ఆదేశించాడు శ్రీనివాసుడు.

''ఓం ప్రథమంగా మంగళస్నానం చేయాలి. అనంతరం ఇష్టదేవతలను ఆరా ధించాలి. తదనంతరం కులదేవతను ప్రతి

ష్టించాలి'' అన్నాడు బ్రహ్మ. అది వినగానే శ్రీనివాసుడికి తన ధర్మపత్ని శ్రీమహాలక్ష్మి గుర్తుకు వచ్చింది.

''కుమారా, మనమందరం నిండుగా ఉన్నప్పటికీ ఈ సభా మందిరంలో కళ లేదు. శ్రీలక్ష్మి లేని చోట కళ ఉండదు సుమా!'' అన్నాడు శ్రీనివాసుడు.

లక్ష్మిని తలచుకుని విచారిస్తున్న శ్రీని వాసుడిని పరమశివుడు ఓదార్చాడు.

''నేను వెళ్ళి మాతను వెంటబెట్టుకు వస్తాను, ఆనతి ఇవ్వాలి'' అన్నాడు బ్రహ్మ దేవుడు.

శ్రీనివాసుడు అయనను వారించి, సూర్య భగవానుని తన సమీపానికి పిలిచాడు.

సూర్యుడు దగ్గరగా వచ్చి, చేతులు జోడించి నిలుచున్నాడు.

''సూర్యా! ఈ ఆనంద సమయంలో ఆదిలక్ష్మిలేని కొరత కొట్టవచ్చినట్లు కని పిస్తోంది. శృగాల వాసుదేవుడి నగరమైన కరవీరపురానికి దగ్గరగా లక్ష్మి తపస్సులో ఉంది. మా వివాహానికి అమెను ఆహ్వా నించి, తీసుకురా!'' అన్నాడు శ్రీనివాసుడు.

తన భర్తకు జరిగే పునర్వివాహానికి శ్రీమ హాలక్ష్మి వస్తుందా? అన్న సందేహం కలి గింది సూర్యుడికి. ఆమాటే పైకి అన్నాడు.

శ్రీనివాసుడు చిరునవ్వు నవ్వాడు. ''పద్మా వతితో మా వివాహం త్రేతాయుగంలో సంక ల్పించినదే సుమా! ఈ వివాహం జరగడానికి వీలుగా, శ్రీలక్ష్మి అలిగి వెళ్ళిపోయింది! శుభవార్త వినిపించి నువ్వు ఆహ్వానించగానే ఆమె ఉత్సాహంగా నీ వెంట వస్తుంది.



వెళ్ళు!'' అన్నాడు. సూర్యభగవానుడు కరవీరపురం దారిపట్టాడు...

శ్రీ మహాలక్ష్మి చిరునవ్వులు చిందిస్తూ, సూర్యుడి వెంట వచ్చింది. శ్రీనివాసుడి పాదాలకు నమస్కరించింది.

శ్రీనివాసుడు ఆమెను సాదరంగా ఆహ్వా నించి తన సమీపంలో కూర్చోబెట్టుకు న్నాడు. ఆమెతో అనునయ వాక్యాలు పలి కాడు.

''దేవీ! రామావతార సమయాన నువ్వు నాతో చెప్పిన సంగతి గుర్తుందా?'' అని లక్ష్మిని అడిగాడు శ్రీనివాసుడు.

''ఎందుకు గుర్తులేదు! వేదవతిని పరి ణయమాడమని ఆనాడు నేను మీకు విన్నవించాను కదా,'' అంది లక్ష్మి చిరు నవ్వుతో.

''ఆనాటి వేదవతే నేటి పద్మావతి'' శ్రీనివాసుడు చిరునవ్వుతో చెప్పాడు.

''ఆ మాత్రం నాకు తెలీదనుకున్నారా? భృగువుమీద నెపంవేసి, నేను అలిగి వెళ్ళిపోయింది ఎందుకనుకున్నారు? పక్కనే నేనుంటే మీరు పద్మావతిని చేరదీయరన్న అనుమానంతోనే వెళ్ళిపోయాను'' అంది ఆదిలక్ష్మి నవ్వుతూ.

''అయితే, శ్రీనివాసుడికి మంగళ స్నానం నువ్వే చేయించు తల్లీ!'' అంది లక్ష్మితో వకుళమాలిక.

''దివ్య పరిమళ తైలంతో నేనే నా నాథుడికి తలంటుతాను'' అంది లక్ష్మి ఆనందంగా నవ్వుతూ.

లక్ష్మి తన హృదయేశ్వరుని మంగళ స్నానానికి పూర్వరంగంగా పరిమళ తైలంతో తలంటింది.

వివిధ పావన తీర్థాలనుంచీ వరుణుడు సేకరించి తెచ్చిన స్వచ్ఛమైన జలాలతో శ్రీనివాసునికి ముత్తయిదువలు మంగళ స్నానం చేయించారు.

ఆ కార్యక్రమానికి సరస్వతీ, పార్వతీ నేతృత్వం వహించారు. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు తదితర మహర్షులకు శ్రీనివాసుడు నమస్కారాలు చేశాడు.

ముత్తయిదువలు శ్రీనివాసుడిని వరుడిగా వస్త్రాలతో, ఆభరణాలతో అలంకరించారు. శ్రీనివాసుడు బ్రహ్మదేవుడి ఆధ్వర్యంలో పుణ్యాహవచనం చేశాడు. అనంతరం అష్టవర్గ అనే వివాహసంబంధమైన కార్యక్రమం నిర్వర్తించాడు.

తదనంతరం కులదేవత ప్రతిష్ఠాపన చేయాలన్నాడు వశిష్ఠ మహర్షి. అందుకు



సమాధానంగా తన కులదేవత శమీవృక్షం అని చెప్పాడు శ్రీనివాసుడు.

పుష్కరిణి ఉత్తర దిశలో ఉన్న కుమార తీర్థం వద్దనుండీ శమీవృక్షశాఖను శాస్త్రోక్త విధానంలో శ్రీనివాసుడు స్వయంగా తీసుకువచ్చాడు.

మహర్షుల సూచన మేరకు, వరాహ స్వామి అనుమతితో ఆయన సన్నిధిలో తన కులదేవత అయిన శమీవృక్ష శాఖను శ్రీనివాసుడు ప్రతిష్ఠించాడు. బ్రహ్మ ఆధ్వర్యంలో కులదేవతను అర్చించాడు.

పూజలన్నీ పూర్తి అయిన తరువాత శ్రీనివాసుడు బ్రహ్మతోనూ, పరమశివుడితోనూ ప్రత్యేకంగా సమావేశం అయ్యాడు.

''వివాహానికి అవసరమైన ధనము నా వద్ద లేదు. కర్తవ్యం ఆలోచించండి'' అన్నాడు వాళ్ళతో శ్రీనివాసుడు.

''అప్పుచేసి వివాహం చేసుకోవడం శాస్త్ర సమ్మతమే...'' అన్నాడు పరమశివుడు సాలోచనగా.

''ధనాధిపతి కుబేరుడున్నాడు. అతని వద్ద రుణంగా తీసుకుంటే, కార్యం జరిగిపోతుంది కదా!'' అన్నాడు బ్రహ్మ.

పరమేష్ఠి, పరమేశ్వరుల అభిప్రాయాలు తెలియగానే శ్రీనివాసుడు కుబేరుడిని సముఖానికి పిలిపించుకున్నాడు.

''కుబేరా, మా వివాహానికి ధనం అవసరమైంది. నువ్వే అప్పుగా సమకూర్చాలి సుమా!'' అన్నాడు శ్రీనివాసుడు.

''రుణపత్రం వ్రాసి ఇస్తే వడ్డీకి రుణంగా సొమ్ములు ఇస్తాను'' అన్నాడు కుబేరుడు.

కలియుగంలో విలంబినామ సంవత్సరం, వైశాఖమాసం, శుక్లపక్ష సప్తమి తిథి అయిన ఆనాడు శ్రీనివాసుడు స్వహస్తాలతో కుబేరుడికి రుణపత్రం రాసి ఇచ్చాడు.

తరవాత బ్రహ్మ, శివుడు ఆ పత్రంలో సాక్షి సంతకాలు చేశారు. ఈ ఘటనకు మూడవ సాక్షిగా అక్కడ ఉన్న అశ్వత్థ వృక్షాన్ని ఎన్నిక చేశారు.

పత్రంలో పేర్కొన్న విధంగా పద్నాలుగు లక్షల మాడల ధనాన్ని కుబేరుడు శ్రీనివాసుడికి అప్పుగా ఇచ్చాడు.






సంజీవకం దమనకానికి హంస కథ చెప్పి, 'నమ్మిన మూఢుడు వెనకటికి ఒంటెలాగా జిత్తులమారి అయిన దుర్మార్గుడి మూలాన మోసపోతాడు,' అన్నది.

'ఏమిటా కథ?' అని దమనకం అడిగింది.

సంజీవకం ఇలా చెప్పింది:

### మోసపోయిన ఒంటె కథ

సాగరదత్తుడు అనే గొప్ప వర్తకుడు ఉండేవాడు. అతను ఒకసారి నూరు ఒంటెలమీద మేలురకం వస్త్రాల మూటలు ఎక్కించి, వర్తకం నిమిత్తం తన ఊరినుంచి బయలుదేరాడు.

ఆ ఒంటెలలో వికటం అనే ఒంటెమీద బరువు ఎక్కువగా పడింది. ఆ బరువు మొయ్యలేక ఆ ఒంటె, కాళ్ళు నీరసమై పోయి, కూలబడి పోయింది. అది కదల లేని స్థితిలో ఉండటం చూసి, వర్తకుడు దానిమీది మూటలను ఇతర ఒంటెలమీద సర్ది, అది భయంకరమైన అరణ్యప్రాంతం కావటం చేత, అక్కడ మజిలీ చేయటం ఇష్టంలేక, ఒంటెను దాని ఖర్మానికి వదిలి వెళ్ళిపోయాడు.

వర్తకుడు వెళ్ళిపోయిన చాలా కాలానికి, వికటం అనే ఆ ఒంటె, అటూ, ఇటూ కదలలేని స్థితికి వచ్చి, అడవి పచ్చిక మేస్తూ, గుంటలలో నీరు తాగుతూ క్రమంగా పుంజుకుంది.

అదే అరణ్యంలో మదోత్కటం అనే సింహం ఉండేది. దానికి చిరుతపులీ, ఒక కాకీ, ఒక నక్కా సేవకులుగా ఉండేవి. ఆ సింహం తన భృత్యులను వెంటబెట్టుకుని

అరణ్యంలో సంచారం చేస్తూ ఒంటెను చూసి, 'ఈ వికారాకారం గల వింత జంతువు ఏమిటి? ఇది అరణ్యంలో ఉండే జంతువో, గ్రామాలలో ఉండేదో తెలుసుకు రండి.' అని తన సేవకులతో అన్నది.

ఒంటెలను గురించి అదివరకే ఎరిగిన కాకి, సింహంతో.. 'ఇది పెంపుడు జంతువు. దీన్ని ఒంటె అంటారు. దీని మాంసం చాలా రుచిగా ఉంటుంది,' అన్నది.

దానికి సింహం 'నాలో విశ్వాసం ఉంచి నా ఇంటికి వచ్చిన ప్రాణిని నేను ఎన్నడూ చంపను. ఇంటికి వచ్చిన అతిథిని చంపితే బ్రహ్మహత్యతో సమానమైన పాపం చుట్టుకుంటుందంటారు. అందుచేత, ఆ ఒంటెకు అభయం ఇచ్చి, దాన్ని నా వద్దకు తీసుకురండి. అది వచ్చిన పని ఏమిటో తెలుసుకుంటాను,' అన్నది.

సింహం సేవకులు వెళ్ళి, ఒంటెకు అభయం ఇచ్చి, దాన్ని తీసుకువచ్చాయి. ఒంటె తన ముందు సాష్టాంగపడినాక, సింహం దాన్ని, 'నువ్వు అరణ్యానికి ఎలా వచ్చావు?' అని అడిగింది.

ఒంటె సింహానికి తన కథ అంతా చెప్పింది. ఇప్పుడు సింహం, 'నువ్వు మీ ఊరికి తిరిగి వెళ్ళకు. బరువులు మోయకు. నాతోపాటు అరణ్యంలోనే ఉండి, పచ్చని గడ్డి తిను,' అన్నది. ఒంటె ఆ ప్రకారమే అరణ్యంలో నిశ్చింతగా ఉండిపోయి, సింహానికి నాలుగో భృత్యుడు అయ్యింది.



ఇంకా కొంతకాలం గడిచింది. సింహం ఒక ఏనుగుతో తలపడి పోరాడేక్రమంలో, ఏనుగు తన దంతాలతో సింహాన్ని పొడిచి తీవ్రంగా గాయపరిచింది. అందుచేత అది తన గుహ నుంచి కదలలేని స్థితిలో ఉండి పోయింది.

అయిదు రోజులు ఇలా గడిచేసరికి సింహమూ, దాని ముగ్గురు పరిచారకులూ తిండికి మాడి చచ్చే పరిస్థితి ఏర్పడింది. ఎందుకంటే, సింహం బయటికి వెళ్ళి ఆహారం కోసం వేటాడటం లేదు. పచ్చిక తిని బ్రతుకుతున్న ఒంటె మాత్రం బాగా కొవ్వి ఉన్నది.

తన అనుచరుల దీనస్థితి గమనించిన సింహం 'నేను గాయపడి, జబ్బుచేసి,

వేటాడలేను గనుక, వెనకటిలాగా మీకు ఆహారం ఇయ్యలేను. మీరే ఎలాగైనా తంటాలుపడి, ఏ జంతువునైనా సంపాదించి తినండి,' అన్నది.

'ఏలినవారు ఈ స్థితిలో ఉండగా మా శరీర పోషణ గురించి మేం ఏమి ఆలోచించగలం?, అన్నాయి మిగిలినవి.

'ఆహా, మీకు నాపట్లగల భక్తి విశ్వాసాలు మెచ్చదగినవి. మీరు వెళ్ళి ఏదైనా జంతువును నాకు కానుకగా పట్టుకురండి. అందరమూ తిందాం,' అన్నది సింహం.

మిగిలిన జంతువులు దీనికి జవాబు చెప్పలేదు.

'మొహమాట పడకండి. వెళ్ళి, ఏ జంతువునైనా చూడండి. ఈ స్థితిలో కూడా నేను వచ్చి, దాన్ని చంపి, మీకు ఆహారం ఇస్తాను,' అన్నది సింహం.

సింహం అనుచరులు నాలుగూ జంతువుల కోసం వెతుకుతూ బయలుదేరాయి. కానీ వాటికి ఒక్క జంతువూ కనబడలేదు. నక్కా, కాకి రహస్యాలోచనకు దిగాయి.

'కాకి మిత్రమా, మనం అర్థం లేకుండా ఎందుకు తిరగాలి? ఈ ఒంటె వికటం కొవ్వి ఉన్నది గదా! దీన్ని చంపి తింటే మనకు చాలా రోజులు సుఖంగా జరిగిపోతుంది గద!' అన్నది నక్క.

దానికి కాకి, 'మిత్రమా, ఆ మాట నిజమేగానీ ఈ ఒంటెకు మన యజమాని అభయం ఇచ్చి ఉండగా మనం ఎలా చంపుతాం?' అన్నది.

'అలా అయితే, నేను ఇప్పుడే యజమాని వద్దకు వెళ్ళి, ఎలాగోలా సమాధానపరచి ఒంటెను చంపడానికి అనుమతి సంపాదిస్తాను,' అని నక్క కాకితో రహస్యంగా గుసగుసలాడి, పైకి మాత్రం మిగిలిన వాటితో: 'మిత్రులారా, మీరు ఇక్కడే ఉండండి. నేను యజమాని వద్దకు వెళ్ళి కర్తవ్యం తెలుసుకుని వస్తాను,' అన్నది.






# మూలకారణం

అమరాపురాన్ని పాలించే జయసేనుడు తప్పు చేసిన వారిని కఠినంగా శిక్షిస్తాడని పేరు పొందాడు.

ఒకసారి జయసేనుడు సభలో దోషులను విచారిస్తున్న సమయంలో పుష్పదంతుడు అనే సాధువు దేశాలు పర్యటిస్తూ అక్కడికి వచ్చాడు. రాజు సాధువుని గౌరవించి అతడిని ఉన్నతాసనం అలంకరింపజేశాడు.

''రాజా! నా రాక వల్ల మీ కార్యక్రమాలు ఆగిపోవడం నాకు ఇష్టం లేదు. మీ సభను యధావిధిగా కొనసాగించండి,'' అన్నాడు పుష్పదంతుడు.

జయసేనుడు దోషులను విచారించి, తప్పు చేసినట్లు రుజువైన వారికి కఠిన శిక్షలు విధించాడు.

తాగుడు మైకంలో రథం తోలి ఒక బాలుడిని గాయపరిచిన సారథికి, తాగి వచ్చి భార్యను చితకబాదిన భర్తకి, తాగిన మత్తులో స్నేహితుడితో గొడవపడి కత్తితో పొడిచిన వాడికీ కఠినకారాగార శిక్షలు విధించాడు.

''స్వామీ! తమరు మా రాజ్యంలో పర్యటించారు. సభలో దోషులను విచారించి తప్పు చేసిన వారికి దండన విధించడం చూశారు. ఇప్పుడు చెప్పండి. మా పరిపాలన మీకు సంతృప్తికరంగా ఉందా?'' అని అడిగాడు రాజు.

''నాకైతే మీ పరిపాలన సంతృప్తికరంగా లేదు. నా పరిశీలనలో ప్రజలు చెడిపోతున్నట్లుగా తోస్తున్నది,'' అన్నాడు పుష్పదంతుడు.

వాణిశ్రీ

''చెడుమార్గంలో నడిచి తప్పు చేసిన వారిని శిక్షిస్తూనే ఉన్నాను స్వామీ! రాజుగా అంతకంటే ఏం చేయగలనో సెలవివ్వండి,'' అన్నాడు జయసేనుడు.

''కుటుంబంలో కూతురు సరిగా లేక పోతే తల్లి తప్పు, కొడుకు చెడిపోతే తల్లి తండ్రులు ఇద్దరిదీ తప్పు. ప్రజలు చెడి పోతే రాజు తప్పు అని ధర్మశాస్త్రాలు చెబు తున్నాయి కద రాజా!'' అన్నాడు సాధువు.

జయసేనుజు ఆశ్చర్య చకితుడై, ''స్వామీ! ఇందులో నా తప్పు ఏముంది?'' అని ప్రశ్నించాడు.

''ప్రజలు ఎందుకు తప్పులు చేస్తు న్నారో, దానికి మూలకారణం ఏమిటో కూడా మీరు ఆలోచించాలి,'' అన్నాడు సాధువు.

జయసేనుడు ఎంత ఆలోచించినా మూలకారణం ఏమిటో అర్థం కాలేదు.

ఈ విషయమై మంత్రులు, అధికారు లను రాజు సంప్రదించాడు. దానికి వారు రకరకాల కారణాలు చెప్పారు. కొందరు డబ్బులెక్కువై విలాసార్థం తాగుతున్నారని, మరి కొందరు కాయ కష్టం చేసినవారు తాగి సేద తీరుతారనీ, ఇలా తమ అభిప్రాయం వెల్లడించారు.

వారు చెప్పిందంతా విని సాధువు చిరు నవ్వు నవ్వాడు.

''మద్యం తాగిన మైకంలో ప్రజలు తప్పులు చేస్తున్నారని సరిగానే ఊహిం చారు. కాని అది మూలకారణం కానేకాదు. ప్రజలు మద్యం సేవించడానికి అవకాశం కల్పించడమే మూలకారణం, మద్య దుకా ణాలు రాత్రింబవళ్లు తెరిచి తాగడానికి అవ కాశం ఉండటమే మూలం కదా?'' అన్నాడు.

జయసేనుడు సాధువు చెప్పిన దాంట్లో సత్యాన్ని గ్రహించి వెంటనే రాజ్యంలో మద్యం అమ్మే దుకాణాలు నిషేధించాడు. కొంతకాలం తర్వాత అమరావురంలో నేరాలు పూర్తిగా తగ్గిపోయి రాజ్యం సుభిక్షమైంది.






# కీర్తి మాధుర్యం

ఇచ్ఛాపురం గ్రామంలో లోకయ్య అనే లోభి ఉండేవాడు. ఒక్క పైసా కూడా ఎవరికీ దానం ఇచ్చేవాడు కాదు. అతడి ఏకైక కుమారుడి పేరు సోమయ్య. అతడు చాలా ఉదారుడు.

ఒకసారి ఇచ్ఛాపురానికి ఒక సన్యాసి వచ్చి గ్రామ ప్రజలతో 'ఎవరైనా తమకు ఉన్న దానిలో కొంత దానం చెయ్యాలనీ, లేకపోతే ఆ సంపద ఉండదనీ, పారిపోతుంద'ని సెలవిచ్చాడు. 'డబ్బు ఒక నీటి చెలమ లాంటిదనీ, అది దానం చేసినకొద్దీ ఎక్కువవుతుంద'ని అన్నాడు. అక్కడే ఉన్న లోకయ్య 'స్వామీ! దానం చేసినకొద్దీ డబ్బు ఎక్కువవుతుందా?' అని ప్రశ్నించాడు. 'అవును. దానం చేసినకొద్దీ డబ్బు తరగదు. ఇంకా ఎక్కువవుతుంది' అన్నాడు సన్యాసి. లోకయ్య 'ఇది నేను నమ్మను' అన్నాడు.

సన్యాసి వెంటనే 'నీవు నమ్మకున్నా ఇది నిజం. నీవు ఎవ్వరికైనా దానం చేసి చూడు. అప్పుడు నీకే తెలుస్తుంది,' అన్నాడు. 'స్వామీ! ఎన్ని రోజుల్లో ధనం ఎక్కువవుతుంది?' అని ప్రశ్నించాడు లోకయ్య. 'అది నేను చెప్పలేను. కానీ దానం చేసిన వ్యక్తికి మాత్రమే ఇది అనుభవం మీద తెలుస్తుంది. వీలైతే దానం చేసి చూడు.' అన్నాడు సన్యాసి. అప్పుడు లోకయ్య 'స్వామీ! మీ మాట మీద విశ్వాసం లేక కాదు. కానీ నాకు తక్షణం ఆ లాభం కనిపించాలి. అలా జరిగితే నా సంపదను తప్పకుండా దానం చేస్తాను,' అన్నాడు.

'సరే! ఒకటి, రెండు రోజుల్లోనే నీకు తెలుస్తుంది. ముందు దానం చెయ్యి' అన్నాడు. లోకయ్య అక్కడే ఒక బిచ్చగాడికి 10 రూపాయలు దానం ఇచ్చాడు.

లోకయ్య ఇంటికి వెళ్ళగానే, ఆయన కొడుకు 'నాన్నా! పది రూపాయలు దానం ఇచ్చావట కదా' అన్నాడు. లోకయ్య 'అప్పుడే ఈ సంగతి నీకూ చేరిందా? సరే! ఆ సన్యాసి

---

ఎస్.రామకృష్ణయ్య

చెప్పాడని చేశా,' అని అన్నాడు. గ్రామస్తులు కూడా ఇంటికి వచ్చి లోకయ్యను అభినందించారు. లోకయ్య ఇవేం పట్టించుకోవడం లేదు. తాను పది రూపాయలు దానం ఇచ్చాడు. తనకు ఎంత లాభం వస్తుంది అనే చింతలో ఉన్నాడు. ఒకరోజు గడిచింది. ఒక్క పైసా కూడా రాలేదు.

రెండవ రోజు లోకయ్య సన్యాసినే ప్రశ్నిద్దాం అనుకొని దేవాలయం దగ్గరకు వెళుతుండగా త్రోవలో ఒక డబ్బు సంచి దొరికింది. అందులో వంద రూపాయలు ఉన్నాయి. లోకయ్య మొహం విప్పారింది. 'ఆహా! ఈయన ఎవరో దేవుడే. ఒక్క పది రూపాయలు దానం చేస్తేనే వంద రూపాయలు అంటే పదింతలు వచ్చాయి' అని సంతోషించాడు. సన్యాసి దగ్గరకు వెళ్ళి 'స్వామీ! మీరన్నది నిజం. దొరికిన వంద రూపాయలు మీకే దానం చేస్తాను. తీసుకోండి,' అని ఇవ్వబోయాడు.

అప్పుడు సన్యాసి 'నీకు దానం చేయాలన్న ఆసక్తి ఉంటే మంచి పనులకు ఇవ్వు. ఇప్పటిలాగా ప్రతి పైసాకు ప్రతిఫలం ఆశించకు,' అని చెప్పి ఊరొదిలి వెళ్ళిపోయాడు.

లోకయ్యకు డబ్బుతోపాటు కీర్తి పెరిగింది. కీర్తిలోని మాధుర్యం తెలిసింది. ఈలోగా గ్రామానికి జరిగిన ఎన్నికలలో లోకయ్యనే గ్రామపెద్దగా ఎన్నుకొన్నారు. లోకయ్యకు సంతోషమయ్యింది. క్రమంగా తన తరగని ఆస్తిని మంచి పనులకు, గ్రామ బాగోగుల కొరకే ఖర్చుపెట్టాడు. దానకర్ణుడని పేరు పొందాడు.

ఇంతకూ ఆ సన్యాసిని తీసుకుని వచ్చి ఉపదేశ మిప్పించినది అతని కొడుకు సోమయ్యేననీ, అతడే వంద రూపాయల సంచీ లోకయ్య వచ్చే దారిలో పడేశాడనీ, అదీ అతని సొమ్మేననీ లోకయ్యకు తెలియదనీ, సోమయ్యకు తప్ప ఎవ్వరికీ తెలియదు. తండ్రిలో మార్పు తేవడానికి గ్రామస్తులను లోకయ్య దగ్గరకు సోమయ్యే పంపాడనీ, అతడిని పొగిడేవారిలాగా చేసాడనీ, అందువల్లనే లోకయ్యకు కీర్తిలోని మాధుర్యం తెలిసిందనీ, దీనికంతటికీ కారణం సోమయ్య ఉపాయమేననీ గ్రామస్తులకు చాలా రోజుల వరకు తెలియలేదు.






పోలవరం గ్రామంలో నాగన్నా, తాయా రమ్మా అనే పేద దంపతులుండేవాళ్ళు. వాళ్ళకు పాపయ్య ఒక్కడే కొడుకు.

వాడికి పదేళ్ళు నిండుతుండగా తల్లి దండ్రులిద్దరూ విషజ్వరంవల్ల, వారం రోజుల తేడాలో మరణించారు. దానితో పాపయ్య అనాధ అయిపోయాడు.

అయితే, గ్రామస్థులు వాడిమీద దయ తలిచి, రోజూ ఒక ఇంటివాళ్ళు వాడికింత అన్నం పెడుతూండేవాళ్ళు. క్రమంగా పాపయ్య పెరిగి పెద్దవాడవుతున్నకొద్దీ, గ్రామస్థులు వాడిచేత చిన్న చిన్న పనులు చేయించుకోసాగారు.

పాపయ్య ఎవరు చెప్పినపనీ కాదనలేక, ఒళ్ళు ఒంచి వాళ్ళు చెప్పే పనులు చేసి పెట్టే, ఊరుమ్మడి నౌకరుగా మారాడు. దానికి ప్రతిఫలంగా గ్రామస్థులు వాడికి తిండి పెట్టేవాళ్ళు.

ఒక్కొక్కసారి ఇద్దరు, ముగ్గురు వచ్చి 'నా పనికి రా, అంటే నా పనికి రా' అని పాపయ్యను పిలిచేవారు. పాపయ్య వాళ్ళల్లో ఏ ఒకరి ఇంటి పనికో వెళ్ళేవాడు. దానితో మిగిలినవాళ్ళు పాపయ్యను నానా తిట్లూ తిట్టి, 'ఇక పైన మా ఇంట్లో నీకు అన్నం ఉండదు,' అని బెదిరించి వెళ్ళే వాళ్ళు.

ఇలా కొన్నాళ్ళు గడిచిన తరువాత, రామయ్య అనే రైతు ఒక రోజున పాప య్యను పిలిచి, 'ఒరే, నువ్వు ఎంతకాల మని గ్రామంలో వాళ్ళందరికీ అడ్డమైన చాకిరీ చేసి బతగ్గలవు! రేపటినుంచీ నువ్వు మా ఇంట్లో ఉండిపోయి, మా పనులు

**25** ఏళ్లనాటి చందమామ కథ

చేసిపెడుతూ ఉండు. నీకు రోజూ మా ఇంట్లోనే అన్నం పెడతాం. తీరుబాటు సమయంలో, మా పిల్లలతోపాటు చదువు కుందువుగాని,' అన్నాడు.

పాపయ్య అందుకు ఒప్పుకుని, ఆ మర్నాటినుంచీ రామయ్య ఇంటిపనులు చెయ్యడం ప్రారంభించాడు. ఈ సంగతి తెలిసి గ్రామంలో వాళ్ళు, వాణ్ణి తమ పనులకు పిలవడం మానుకున్నారు.

ఇలా ఒక నెల గడిచేసరికి, పోలయ్య అనే రైతుకు ఒక ఆలోచన వచ్చింది. ఆయన రహస్యంగా పాపయ్యను పిలిచి, 'ఒరే పాపయ్యా! నువ్వెంత పనిమంతుడివి! ఎంత నమ్మకస్థుడివి! అటువంటి నీకు, ఆ రామయ్య నీ కాలేకడుపుకు ఇన్ని గంజి నీళ్ళు పోసి, నీచేత గొడ్డు చాకిరీ చేయించు కుంటున్నాడు. ఇది అన్యాయం! నువ్వు పని చేసేందుకు మా ఇంటికి రా. నీకు కడుపునిండా భోజనం పెట్టి, రోజూ ఒక రూపాయి కూడా ఇస్తాను,' అన్నాడు.

ఇందుకు పాపయ్య సరేనని, రామయ్య ఇంట పనిమాని, పోలయ్య ఇంటికి వచ్చి వాళ్ళ పనులు చేయసాగాడు. రామయ్య ఉక్రోషంకొద్దీ పోలయ్యనూ, పాపయ్యనూ నానా తిట్లూ తిట్టాడు.

పోలయ్య ఊరి రచ్చబండ దగ్గిర చేరిన పదిమందితో, రామయ్యను గురించి చెప్పి, 'రామయ్య, అలా నోరుపారేసుకోవడం ఏం బాగా లేదు. ఇందులో నా తప్పేముంది? ఆ పాపయ్యగాడి మొఖాన పిడికెడు మెతు కులు పారేసి, ఆయన వాడిచేత రాత్రనకా, పగలనకా వెట్టిచాకిరీ చేయించుకుంటు



న్నాడు. నేను వాడికి సుష్టుగా అన్నం పెట్టడమేగాక, రోజూ ఒక రూపాయి కూడా ఇస్తున్నాను' అన్నాడు.

ఇది విని అక్కడ చేరినవాళ్ళలో కొందరు రామయ్య పక్షానా, మరికొందరు పోలయ్య పక్షానా మాట్లాడటం ప్రారంభించారు. క్రమంగా అది కీచులాటగా తయారైంది.

అప్పుడు గ్రామ మునసబు కల్పించుకుని, 'ఒక అనాథ పిల్లాడి కోసం మీలో మీరు కీచులాడుకోవటం ఏమీ బాగా లేదు. ఆ పాపయ్య పుట్టు బానిసేం కాదు గదా? ఏ ఇంట వాడికి సౌకర్యంగా ఉంటే, ఆ ఇంట పనిచేస్తాడు,' అన్నాడు.

'అవును, అంతేగదా మరి!' అన్నాడు గ్రామంలోకెల్లా పెద్దరైతయిన భూషయ్య.

ఆ మర్నాడు భూషయ్య తన పాలేరును పంపి పాపయ్యను తన ఇంటికి పిలిపించి వాడికి అన్నంపెట్టినెలకు యాభై రూపాయిలిచ్చేటట్టూ, దాంతోపాటు సంక్రాంతి పండుగకు ఒక జత కొత్తబట్టలిచ్చేటట్టూ మాట్లాడి, వాణ్ణి తన పనిలో పెట్టుకున్నాడు.

ఆ సంగతి తెలిసి పోలయ్య రచ్చబండ దగ్గిర 'ఆ భూషయ్య బాగా ఉన్నవాణ్ణని మిడిసిపడుతున్నాడు. నా ఇంటి నౌకరయిన పాపయ్యను లేనిపోని ఆశలుపెట్టి తీసుకుపోతాడా! ఇదేం తెలివైన పనికాదు,' అన్నాడు కోపంగా.

అక్కడే ఉండి, ఆ మాటలు విన్న రామయ్య, 'నువ్వు చేసిన పనేమిటి? నా దగ్గిరున్న ఆ పాపయ్యగాడికి డబ్బాశ పెట్టి తీసుకుపోయావుగదా. అది తెలివైనపనా?' అని అడిగాడు.



దానితో పోలయ్య రెచ్చిపోయి, రామయ్యను తిట్టడం ప్రారంభించాడు. నలుగురూ చేరి వాళ్ళను సర్ది, ఎవరి ఇళ్ళకు వాళ్ళను పంపేశారు.

కొన్నాళ్ళుగా, ఈ జరుగుతున్న తతంగాన్నంతా గమనిస్తున్న పాపయ్య, ఆ రాత్రి ఒక ఉత్తరం రాసి, దాన్ని మునసబు ఇంటి కిటికీలోంచి లోపలకు విసిరి, గ్రామం విడిచి ఎటో వెళ్ళిపోయాడు.

తెల్లవారాక మునసబు ఆ ఉత్తరం చదివి నవ్వుకుని, సాయంకాలం రచ్చబండ దగ్గిరకు వచ్చి, అక్కడ ఉన్న వాళ్ళతో, 'పాపయ్య ఉత్తరం ఒకటి రాసి మా ఇంట్లో పడేసి గ్రామం వదిలిపోయాడు. అందులో ఏమున్నదో చదవమంటారా?' అని అడిగాడు.

చదవమన్నట్టు అందరూ తలలూపారు.

'గ్రామంలోని చిన్నా, పెద్దలందరికీ నమస్కారాలు. నా తల్లీ తండ్రీ పోయాక అనాథుడనైన నాకు గ్రామంలోని వారందరూ ఇంత అన్నంపెట్టి, ఎంతో ఆప్యాయంగా పెంచి పెద్ద చేసినందుకు కృతజ్ఞుణ్ణి.

కానీ ఇప్పటి పరిస్థితి చూస్తే, నా వల్ల గ్రామస్థులు ఒకరిపై ఒకరు ద్వేషాన్ని పెంచుకుని, ఒకరినొకరు కత్తులతో పొడిచి చంపుకుంటారేమో అన్న భయం కలుగుతోంది. అందువల్ల ఎవరికీ చెప్పకుండా, చీకటిమాటున గ్రామం విడిచి దూరంగా పోతున్నాను.'

మునసబు ఈ విధంగా ఉత్తరం చదివి, అందరి ముఖాలకేసీ ఒకసారి పరీక్షగా చూసి, 'పాపయ్య మరికొంత కాలంలో గ్రామంలో ఉంటే, వాడు ఊహించిన విపత్తు మన గ్రామానికి తప్పేది కాదు. వాడు నిజంగానే మనందరికన్నా తెలివైన వాడు! ఏమంటారు?' అని అడిగాడు.

– భైరి సత్యనారాయణ






# తిక్కకు తిక్క మందు

అలమండ జమీందారు పర్వతాలయ్యకు భూములు, తోటలు ఎక్కువగా ఉండటం వల్ల చాలామంది పనివాళ్ల అవసరం పడ్డది. పనికోసం వెళ్లిన వారు జమీందారు అడిగే తిక్క ప్రశ్నలకు జవాబీయలేక తిరుగు ముఖం పట్టేవారు. ఒకవేళ పనిలో ఎవరైనా కుదిరితే ప్రశ్నలతో విసిగించి వారిని ఇంటికి పంపేవాడు.

తనకు ఖాళీ దొరికితే చాలు పనివారితో గుప్పెడు ఇసుక తీసి 'దీంట్లో ఎన్ని ఇసుక రేణువులుంటాయో లెక్కేసి చెప్పండి?' అనేవాడు. వాళ్ళేదో సంఖ్య చెబితే అది కాదనీ, తన లెక్క ప్రకారం ఫలానాది అనేవాడు. అన్నం తింటున్నప్పుడు తను తిన్న అన్నం ఎన్ని గింజలు వండితే తయారైందో చెప్పమనేవాడు. 'ఈరోజు వర్షం వస్తుందా, రాదా' అని అడిగేవాడు. వస్తుంది అంటే, ఎలా వస్తుందనీ, రాదు అంటే.. ఎందుకు రాదనీ నిలదీసేవాడు. ఇలా నానా ప్రశ్నలు వేసి, చివరికి తన జవాబే సరైనదని వాళ్ళని ఒప్పించేవాడు. ఎవరైనా ఎదురు తిరిగితే వారి జీతంలో కోత విధించేవాడు.

ఇది విన్న సుధానందుడనే యువకుడు జమీందారుని కలిసి ఎలాగైనా తనకు పని ఇప్పించమన్నాడు. జమీందారు ఎప్పటి లాగే తిక్క ప్రశ్నలు మొదలెట్టాడు. 'ఈ గుప్పెట్లో పట్టే అన్నం ఎన్ని గింజలతో సమానం?' అని అడిగాడు.

'ఓహో..! ఇంతేనా! అదిగో ఆకాశంలో ఆ మూలన కనిపిస్తున్న నక్షత్రాల పోగులో ఉన్నన్ని గింజలు' అని ఠక్కున జవాబి చ్చాడు సుధానందుడు.

మరోసారి పెరటి బావి దగ్గరకు తీసుకెళ్ళి 'ఇదిగో ఈ చెంబుతో కొలిస్తే ఈ బావిలో

కె.కె. రఘునందన

నీళ్ళు ఎన్ని చెంబులౌతాయి?' అని చిక్కులో పెట్టాడు. 'ముందుగా మీరీ బావిలోని నీళ్ళన్నిటినీ తోడించి ఆ ఎండిపోయిన చెరువులోకి నింపండి. నేను కొలిచిచెబుతా!' అని తడుముకోకుండా చెప్పేశాడు. కంగు తిన్నాడు జమీందారు పర్వతాలయ్య.

ఒకసారి జామపండు తెచ్చి, 'ఇందులో పురుగులున్నాయో లేదో చెబితే నేను తింటాను చెప్పుకో!' అన్నాడు జమీందారు పరీక్షిస్తున్నట్లుగా. వెంటనే సుధానందుడు పండును కసుక్కున మధ్యకు కొరికి విప్పి 'ఇందులో ఒక్క పురుగు లేదు. మీరిక తినొచ్చు,' అని తిరిగి జమీందారు చేతికి చ్చేశాడు. పండును కొరక్కుండా చెప్పాలనే షరతును పెట్టనందుకు వాపోయిన జమీందారు ఎంగిలి పండును తినలేక పెంటలో పారేశాడు.

సుధానందుడిని చిక్కుల్లో పెట్టకుండా వదలదల్చుకోని జమీందారు మరింతగా అతడిని ఆటపట్టించాలనే భావంతో 'నా వజ్రాల ఉంగరం మాయమైపోయింది. దాన్ని దొంగలు ఆకాశంలో నక్షత్రాల మధ్యన దాచిపెట్టారని నా అనుమానం! నువ్వెలాగైనా వెళ్ళి తీసుకురావాలి,' అన్నాడు.

'తప్పకుండా! అంత విలువైన వజ్రాల ఉంగరాన్ని వెతికి మీకివ్వాలనే నాకున్నది. ఆకాశం పైకి ఎక్కడానికి నాకో నిచ్చెన కావాలి. దాన్ని ఏర్పాటు చేయండి. మీ ఉంగరం భద్రంగా అప్పగిస్తా!' అనేసరికి జమీందారు అవాక్కయ్యాడు.

మరొక రోజు అందరిముందూ ఎలాగయినా సుధానందుడిని ఇరుకున పెట్టాలని, 'నా తలపై ఉన్నన్ని వెంట్రుకలకు సమాన సంఖ్యలో ఆవాలను ఈ పాత్రలో పోయాలి.



లెక్క తేడా వస్తే ఒప్పేది లేదు. నిన్ను పని లోంచి తీసేస్తా,' అని తిక్క ప్రశ్న వేశాడు.

సుధానందుడు జమీందారు అడిగిన ప్రశ్నకు నవ్వి బయటకు వెళ్ళి ఒక గుడ్డలో ఆవాలు మూటగట్టుకుని వచ్చి వాటి సంఖ్య చెప్పి పాత్రలో పోశాడు.

పర్వతాలయ్య అందుకు అంగీకరించక 'నీ లెక్క శుద్ధ తప్పు. నా తలమీద వెంట్రుకల సంఖ్య ముప్పై వేల నాలుగు వందల యాభై. నువ్వు తెచ్చిన ఆవాల సంఖ్య తిరకాసుగా ఉంది. మరోసారి లెక్కేసి చెప్పు. రెండూ సరిపోవాలి. అప్పుడే నువ్వు గెలిచినట్లు,' అని ఇబ్బందిలో పెట్టాడు.

'నా ఆవాల లెక్క తప్పయితే అవచ్చు. కానీ మీ అంతటి జమీందారు అబద్ధమాడరన్న విషయం జనానికి బాగా తెలుసు. అందువల్ల నేను ఆవాలు ఇక్కడ పోసి లెక్కిస్తాను. రెండూ సమానమో కాదో తేలాలంటే, అదే సమయంలో మీరు మీ తల మీదనున్న వెంట్రుకలను ఇక్కడ పెట్టి లెక్కపెట్టాలి. అప్పుడు మీరెంత నిక్కచ్చో జనం మరోసారి గ్రహిస్తారు,' అని అనగానే ఏం చెప్పాలో తెలీక అయోమయంలో పడ్డాడు పర్వతాలయ్య.

'అయ్యా! అతగాడు సూచించినట్లుగా చేస్తే మీకే మంచిది. అతగాడు ఓడిపోతే పనిలోంచి తీసేయొచ్చు. మీ లెక్క తప్పు కాదని నిరూపించి బుద్ధి చెప్పండి. వెనక్కి తగ్గితే మీ పరువు పోతుంది,' అని ఒత్తిడి తెచ్చారు అక్కడకొచ్చిన జనం.

జమీందారు పర్వతాలయ్య ఇరుకున పడ్డాడు. నోటమాట రాలేదు. ఇంతకాలం తన అహంకారంతో అందర్నీ తిక్క ప్రశ్నలేసి హింసించాడు. కానీ, సుధానందుడు మాత్రం తెలివిగా వ్యవహరించి, తనను ఓడించాడు.

తను తల వెంట్రుకలను నలుగురిలో తీయించుకోవటం కంటే అవమానం మరోటి ఉండదన్న నిజం గ్రహించిన జమీందారు పర్వతాలయ్య అందరిలో తన తప్పు ఒప్పుకుని, ఆ రోజు మొదలు తిక్క ప్రశ్నలతో వేధించటం మానుకున్నాడు.





# ఇష్టంలేని న్యాయం

పూర్వం ఒక గ్రామంలో రామయ్య అనే కాపు ఉండేవాడు. ఆయన భార్య గంగమ్మ గయ్యాళి. తమకు భగవంతుడింత ఇచ్చాడు గదా అని మిడిసి పడేది.

ఒకనాడు రామయ్యా, గంగమ్మా పొరుగూరులో బంధువుల ఇంట అక్కర అయితే వెళ్ళి కాలినడకన తిరిగి వస్తున్నారు. మసక చీకటి పడుతున్నది. గ్రామం కూడా అంత దూరంలో ఉన్నది.

వారికి దారిలో మామిడి చెట్టొకటి ఎదురయింది. చెట్టునిండా మామిడిపళ్ళు, కొన్ని పండినవీ కొన్ని ఇంకా పండనివీ కనిపించాయి.

''ఇదుగో! కాస్త మామిడి చెట్టెక్కి మంచి పళ్ళుగా చూసి కోసి పెట్టవూ? ఈ ఏడు మామిడి పండెట్లా ఉంటుందో రుచే చూడలేదు,'' అన్నది గయ్యాళి గంగమ్మ.

''పొద్దుపోయింది. కావలిస్తే రేపు బుట్టెడు తెప్పిస్తాలే!'' అన్నాడు రామయ్య.

''నాకిప్పుడే కావాలి. చెట్టెక్కి రెండు పళ్ళు కోస్తే పోయేదానికి రేపు బుట్టెడు తెస్తాట్ట!'' అని సాధించింది గంగమ్మ.

గత్యంతరంలేక రామయ్య చెట్టెక్కటానికి వెళ్ళాడు. ఆయన చెట్టు కిందికి వెళ్ళాడో లేదో చెట్టు కొమ్మమీది నుంచి ఎవరో ఆయనపై పడ్డాడు. రామయ్య కింద పడిపోయాడు. కాలు పట్టుకుపోయింది.

''అయ్యో! అయ్యో! నీకెంత పొగరురా కావాలని నా మొగుడి మీద విరుచుకపడతావుట్రా?'' అని కిందపడిన మనిషిని ఆడిపోయసాగింది గంగమ్మ.

ఆ మనిషి లేచి రామయ్యను లేవదీస్తూ, ''అమ్మా తల్లీ! నేను కాలుజారి పడ్డాను. కావాలని పడలేదు. దేవుడు సాక్షి!'' అంటూ

భరత్ వెంకటరమణ

ప్రాధేయపడ్డాడు. కానీ గయ్యాళి గంగమ్మ వినిపించుకోలేదు. గుడ్లెర్రజేసి చేతులు ఊపుతూ, ''నిన్ను ఊళ్ళో చెప్పి ఏం చేయిస్తానో చూడు! నీ అబద్ధాలు గంగమ్మ దగ్గరనా?'' అంటూ తిట్టసాగింది.

భార్యాభర్తలు ఊరు చేరుకున్నాక గంగమ్మ ఊరి న్యాయాధికారి దగ్గరకు వెళ్ళి ఫిర్యాదు చేసింది. ''ఎందుకు, ఊరుకోవే!'' అని మొగుడు అన్నా వినిపించుకోలేదు.

''ఇదిగో! నువ్వెప్పుడూ ఇంతే! ఊళ్ళో వాళ్ళంతా నీమీద పడినా చూస్తూ ఊరుకుంటావు,'' అన్నది గంగమ్మ.

న్యాయాధికారి మర్నాడు గంగమ్మనూ, రామయ్యనూ, రామయ్యమీద పడిన బసవయ్య అనేవాణ్ణి పిలిపించాడు.

అందరు చెప్పినది విన్నమీద న్యాయాధికారి కూడా బసవయ్య బుద్ధిపూర్వకంగా తప్పు చేయలేదని నమ్మాడు.

ఈసారికి బసవయ్యను క్షమించి పోనివ్వమని గంగమ్మకు హితవు చెప్పాడు.

''ఇదేనా మీరు చెప్పే న్యాయం? ఈ దుర్మార్గుడు మామిడి చెట్టులో దాక్కుని మా ఆయన చెట్టు కిందికి రావటం చూసి మీద దూకేస్తాడా? మీవల్ల కాకపోతే చెప్పండి. నేనింకో చోటుకివెళ్ళి న్యాయం రాబట్టుకుంటాను'' అన్నది గంగమ్మ

''సరే, అయితే నీకు కావలసిన న్యాయం నేనే చేస్తాను! ఆ మామిడిచెట్టు నువ్వే ఎక్కు. బసవయ్య దాని కిందికి రాగానే సూటిగా అతనిమీద దూకు!'' అన్నాడు న్యాయాధికారి.

''నేను చెట్టెక్కనా? ఆ మనిషిమీద పడబోయి పొరపాటున కిందపడితే? ఒకవేళ మనిషి మీదనే పడితే మాత్రం నాకు దెబ్బ తగలదూ?'' అన్నది గంగమ్మ వెలవెల బోతూ.

''ఈ అనుమానాలన్నీ బసవయ్యకైనా ఉండవలసిందే గదా! మరి బసవయ్య మాట నమ్మవేం?'' అన్నాడు న్యాయాధికారి.

గంగమ్మ బుద్ధి తెచ్చుకుని తిరిగి చూడకుండా భర్తతో సహా ఇంటికి పోయింది.






# శిథిలాలయం - 12

(శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారి దాగి వున్న గుహ దగ్గిరకు వెళ్ళారు. కానీ, అతడు అందులో లేడు. సవర భేరుండాన్ని వెంటబెట్టుకుని పూజారి కొండ దిగి లోయకేసి పోతుండటం వాళ్ళకు కనిపించింది. శిఖిముఖీ వాళ్ళు అతణ్ణి వెంబడించారు. పూజారి లోయలో ఉన్న గండ శిలలను శిఖిముఖికి చూపి, అక్కడికి రమ్మన్నారు తరవాత-)

శిథిలాలయ పూజారి మాటలు, శిఖిముఖీ వాళ్ళకు చాలా కోపాన్ని తెప్పించినాయి. వాళ్ళు వేగంగా లోయలోకి దిగి, రాళ్ళ ముందు నిలబడి వున్న పూజారీ, సవర భేరుండాల్ని సమీపించేంతలో, రాళ్ళ వెనుకనుంచి దాదాపు పదిమంది చెంచులు పెద్దగా కేకలు పెడుతూ ముందుకు దూకారు. వాళ్ళ నాయకుడు ఒక గుర్రం మీద రాతి చాటునుంచి ముందుకు వచ్చి, 'ఎవరు? శిఖిముఖీ, నాగుమల్లులా? శబర, సవర నాయకుల పిల్లలన్నమాట! మీరు నా బందీలు. మీ తండ్రులు ఏ పాటి ధనం ఇచ్చి మిమ్మల్ని విడిపించుకు పోతారో చూస్తాను,' అన్నాడు.

'భేష్, బావుంది! అదీ అసలు కథ! ఇందులో నేనెలాంటి జోక్యం కల్గించుకోను, అర్థమైందా శిఖీ!' అంటూ పెద్దగా నవ్వాడు శిథిలాలయ పూజారి.

'వాడు చెంచు బందిపోట్ల నాయకుడు, బడేచెంచు, కేసరీ!' అన్నాడు శిఖిముఖి ఈటె ఎత్తుతూ.

'ఇది పూజారి దుర్మార్గుడు మనకోసం పెట్టిన మాటు!' అన్నది నాగుమల్లి ఈటె ఝుళిపిస్తూ.

దాసరి సుబ్రహ్మణ్యం

విక్రమకేసరి ఏమీ జవాబివ్వకుండా మెరుపులా ముందుకు దూకి, బడేచెంచు తలమీద ఈటెతో బలంగా ఒక దెబ్బ కొట్టి, ఆ దెబ్బకు చెంచు గుర్రంమీద నుంచి కింద పడుతూండగానే, గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని, 'శిఖీ, మల్లీ! మాటల్లో కాలయాపన ప్రమాదం. మీరిద్దరూ వెనక్కి పారిపోండి. పూజారి మీ కోసమే ఇంత దుష్ట తంత్రం పన్నాడు.' అంటూ శిఖిముఖిని భుజం పట్టుకుని ముందుకు లాగి, బలవంతంగా గుర్రం ఎక్కించాడు. నాగుమల్లి ఏదో అభ్యంతరం చెప్పబోయింది. కానీ విక్రమకేసరి ఆమెకు అవకాశం ఇవ్వకుండా, వడిసి పట్టుకుని శిఖిముఖి వెనక గుర్రంమీద ఎక్కించి, గుర్రాన్ని డొక్కలో గట్టిగా ఒక తన్ను తన్నాడు.

ఇదంతా కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయింది. బడే చెంచు అనుచరులు తెప్పరిల్లి కేకలు పెడుతూ ముందుకు వచ్చే లోపలే శిఖిముఖీ, నాగుమల్లీ ఎక్కిన గుర్రం లోయలో పరిగెత్తసాగింది. నేలమీద పడ్డ బడే చెంచు 'అబ్బా' అంటూ లేచి నిలబడి, 'మీరు ఆ గుర్రంమీద వెళ్ళేవాళ్ళను పట్టుకోండి. ఈ చవటల సంగతి నేనూ, పూజారి ప్రభువూ చూస్తాం,' అన్నాడు.

చెంచులు ఐదారుగురు అరుస్తూ గుర్రం వెనక పరిగెత్తారు. శిథిలాలయ పూజారి అక్కడ నిలబడి ఉన్న మిగతా చెంచులతో, 'ఈ విక్రమకేసరిని ప్రాణాలతో పట్టుకోండి.



శిథిలేశ్వరీ దేవికి బలి పెట్టడానికి ఇంతకంటే అర్హుడు ఈ భూ ప్రపంచంలో దొరకడు.' అన్నాడు పళ్ళు కొరుకుతూ.

విక్రమ కేసరి తన ముగ్గురు అనుచరులనూ హెచ్చరించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, కొండకేసి కదలసాగాడు. చెంచులు భయంకరంగా కేకలుపెడుతూ వాళ్ళను చుట్టుముట్టేందుకు ముందుకురికారు.

'బడేచెంచూ, నువ్వు పెద్ద పొరపాటు చేశావు. నీ వాళ్ళను మరో ఇరవైమందిని వెంటతెస్తే పని సానుకూలమయ్యేది. ఈ విక్రమకేసరి మహా పొగరుబోతు. గాయపరచకుండా అతణ్ణి పట్టుకోవటం సాధ్యం కాదు. శిథిలేశ్వరీదేవికి క్షతగాత్రుణ్ణి బలి పెట్టడం గొప్ప అపచారం. అందువల్ల మనం



ప్రస్తుతానికి ఈ విక్రమకేసరిని వదిలి మన నివాసాలకు పోవటం ఉత్తమం,' అన్నాడు పూజారి.

'పూజారి ప్రభూ! చూడండి, వాడు నా వాళ్ళను రాళ్ళచుట్టూ ఎలా గిరికీలు తిప్పి స్తున్నాడో, తమరొక పని చేయకూడదా? మంత్రం ప్రయోగించి వాడి కాళ్ళూ, చేతులూ ఆడకుండా బంధించండి,' అన్నాడు బడే చెంచు.

ఆ మాటలకు పూజారి పెద్దగా నవ్వుతూ, 'నా మహామంత్ర శక్తిని ఈ హీనుణ్ణి పట్టుకు నేందుకు ప్రయోగించటమా? ఎంత మాట న్నావు, చెంచూ! పొరబాటు, పొరబాటు. నే చెప్పినట్టు చెయ్యి. నీ వాళ్ళను తిరిగి రమ్మను. కావాలంటే వాళ్ళను కూడా ఆ శిఖిముఖీ, నాగుమల్లులను పట్టుకునేం దుకు పంపు,' అన్నాడు.

'చిత్తం, పూజారి ప్రభూ, చిత్తం!' అంటూ బడే చెంచు తలవంచి పూజారికి నమస్క రించి, విక్రమకేసరితో పోరుతున్న తన అనుచరులను తిరిగి రావలసిందిగా పెద్ద కేక పెట్టాడు. ఆ కేక వింటూనే చెంచులు బతుకు జీవుడా అనుకుని, విక్రమ కేసరి వల్ల గాయపడిన తమవాణ్ణొకణ్ణి భుజాన వేసుకుని, తమ నాయకుడి వద్దకు తిరిగి వచ్చారు. 'పూజారి ప్రభూ! ఇక మనం మన ఆకాశ గుహకు వెళదామా? నా వాళ్ళు ఆ శిఖిముఖినీ, నాగుమల్లినీ అక్కడికే పట్టుకు వస్తారు. నా తలదిమ్ము ఇంకా వదల్లేదు' అన్నాడు బడేచెంచు.

'అలాగే వెళదాం. కానీ... నీ వాళ్ళు వాళ్ళిద్దర్నీ పట్టుకోగలరా అన్న సంశయం నాక్కలుగుతున్నది. నేనీ ప్రాంతాలకు వచ్చినప్పటినుంచీ, ఎందుకనో అన్నీ విఘ్నాలే ఎదురవుతున్నవి. వింధ్యకు దక్షిణాన శిథిలేశ్వరీ దేవి ప్రభావం అంతగా చెల్లుబడి అవుతున్నట్టు కనబడదు,' అన్నాడు పూజారి నిస్పృహగా.

'కావొచ్చు పూజారి దొరా! మనకి కోతి వెధవల్తో పనేం? చక్కా బ్రహ్మపుత్రా నదీ లోయలకు వెళ్ళిపోదాం. బయలుదేరండి. ఊ ఎగరమన్నారా, ఆకాశంలోకి?' అంటూ సవర భేరుండం చేతులు పైకీ కిందికీ ఆడించసాగాడు.

పూజారి, భేరుండం మెడమీద ఒక్క చరుపుచరిచి, 'ఎగరటానికి వేళాపాళా లేదా? ఇది వాయనవేళ, భేరుండాలు ఈ వేళప్పుడు పైకెగరలేవు, నేలనంటి పెట్టుకుని ఉండాల్సిందే, తెలిసిందా? ఇక నోరు మూసుకుని బుద్ధిగా వెంటరా,' అంటూ బయలుదేరాడు.

చెంచు నాయకుడి వెంట పూజారి తతిమ్మా చెంచులూ అతడి నివాసమైన ఆకాశ గుహకు బయలుదేరారు. అదే సమయంలో విక్రమకేసరి తన వెంటవున్న శబరులతో కలిసి, శిఖిముఖీ, నాగుమల్లులు గుర్రంమీద పారిపోతున్న లోయప్రాంతంకేసి పరిగెత్తసాగాడు. అతడికి గుర్రంమీద వున్న వాళ్ళిద్దరూ, వాళ్ళను పట్టుకునేందుకు వెనకగా పరిగెత్తుతున్న చెంచులూ కనబడు తూనే ఉన్నారు. గుర్రం ఎగుడు దిగుడుగా ఉన్న ఆ ప్రాంతాల వేగంగా పరిగెత్తలేక పోతున్నందున చెంచులు దాన్ని చుట్టు ముట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

విక్రమకేసరి పెద్దగా, 'శిఖీ, మల్లీ! మేం వస్తున్నాం. పూజారీ, బడేచెంచూ పారి పోయారు,' అని కేకలు వేస్తూ వారికేసి పరిగెత్తసాగాడు. కానీ, అతడు వాళ్ళను సమీపించేలోపలే ఇద్దరు ముగ్గురు చెంచులు ముఠానుంచి విడివడి, అడ్డ దారిన రాళ్ళమీదుగా దూసుకుపోయి ముందు వైపునుంచి గుర్రం దారిని అటకా యించారు.



శిఖిముఖి కత్తితోనూ, నాగుమల్లి ఈటె తోనూ ఆ చెంచులు గుర్రాన్ని సమీపించ కుండా ఆపసాగారు. ఒకటి రెండు నిమి షాల తరువాత శిఖిముఖి గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని పక్కకు లాగి, దాన్ని లోయలో నుంచి కొండమీదికి ఎక్కించసా గాడు. అతడికి విక్రమకేసరి కేకలు వినిపిం చినై. కేసరి కొండమీది నుంచి తనకేసి దిగి వస్తున్నాడని అతడు భావించాడు.

శిఖిముఖి గుర్రాన్ని కొండమీదికి ఎక్కించే ప్రయత్నం గమనిస్తూనే, ఒకచెంచు అటుగా పరిగెత్తి గట్టిగా చప్పట్లు చరుస్తూ, దాన్ని బెదరకొట్టసాగాడు. గుర్రం కొంచెంగా బెదిరి వెనక కాళ్ళమీద లేచింది. ప్రమాదాన్ని గుర్తించిన నాగుమల్లి తన చేతిలోని ఈటెను




నుంచి అంతెత్తు ఎగిరి దభీమంటూ కింద పడి గుర్రంకేసి దొర్లుకుంటూ పోయాడు. గుర్రం బెదుటుకుని గిర్రున వెనుదిరగ బోయి, వెనక కాళ్ళకింద ఉన్న గులకరాళ్ళు పట్టుతప్పి జారటంతో పక్కకు పడి, ఏట వాలుగా ఉన్న కొండమీది నుంచి దిగువకు దొర్లుకుపోసాగింది. గుర్రంతోపాటు కింద పడిన శిఖిముఖీ, నాగుమల్లిలు కూడా కిందికి దొర్లుకుపోయారు.

చెంచువాళ్ళు ఈ దృశ్యం చూస్తూనే, సంతోషం పట్టలేక పెద్దగా చప్పట్లు చరిచి, కేకలు పెడుతూ, 'పట్టుకోండి, పట్టుకోండి,' అంటూ శిఖిముఖీ, నాగుమల్లులకేసి పరిగె త్తారు. వాళ్ళు శిఖిముఖీ వాళ్ళను సమీపించే లోపలే విక్రమకేసరి బాణం ఎక్కుపెట్టి గుంపు మధ్యకు వదిలాడు. బాణం ఒక చెంచును తాకింది. వాడు ఒక్క చావుకేక పెట్టి కిందపడిపోయాడు. అంతలో శిఖిముఖి లేచి నిలబడి తనను పట్టవచ్చే చెంచువాణ్ణి ఒక్క తన్ను తన్ని, అతడి చేతిలోని ఈటెను లాక్కున్నాడు.

కానీ, ఈ లోపల గుర్రంమీంచి కింద పడటంవల్ల గట్టి దెబ్బ తగిలి స్పృహ కోల్పోయిన నాగుమల్లిని ఇద్దరు చెంచులు భుజాలమీద వేసుకుని లోయకు అడ్డం పడి పరిగెత్తసాగారు. తతిమ్మా చెంచులు ఓ క్షణకాలం శిఖిముఖిని ప్రతిఘటించి, దూరం నుంచి పరిగెత్తుకు వస్తున్న విక్రమ కేసరినీ, శబరుల్నీ చూసి, ఇక లాభం

చెంచువాడికేసి విసిరింది. కానీ, చెంచు ఆ దెబ్బ తప్పుకుని మరింత గట్టిగా చప్పట్లు చరుస్తూ, గావుకేకలు పెట్టసాగాడు.

శిఖిముఖీ, నాగుమల్లులకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన విక్రమకేసరి చప్పున వడిశెల ఉన్న శబరుణ్ణి దగ్గిరకు పిలిచి, 'బాగా గురిచూసి ఒక్క దెబ్బతో గుర్రంముం దున్న చెంచువాణ్ణి కింద పడకొట్టాలి. ఆ వెనకపరిగెత్తుకొస్తున్న వాళ్ళ సంగతి తరవాత చూద్దాం,' అన్నాడు. శబరుడు వడిశెలలో రాయిపెట్టి, దాన్ని గిర్రున రెండుసార్లు తిప్పి, చెంచుమీదికి విసిరాడు. అది జుయ్ మంటూ పోయి గుర్రాన్ని అడ్డగిస్తున్న చెంచు గుండెలను బలంగా తాకింది.

ఆ దెబ్బకు వాడు అరుస్తూ నేలమీది

లేదనుకుని తాము కూడా లోయలోకి పారిపోయి, చూస్తుండగానే రాళ్ళ వెనక మాయమయ్యారు.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చేయి వూపి రాళ్ళ వెనుకకు పారిపోయిన చెంచుల వెంటపడ్డాడు. కానీ, అతడు గుర్రంమీది నుంచి పడ్డపాటుకు మోకాలు కొంచెం బెణకటంతో వాళ్ళననుసరించి వేగంగా పరిగెత్తలేకపోయాడు. ఆ దశలో విక్రమకేసరి వచ్చి అతణ్ణి కలుసుకున్నాడు.

'కేసరీ! పెద్ద ఘోరం జరిగిపోయింది. ఇంతమందిమి ఉండి, నాగుమల్లిని రక్షించలేకపోయామంటే, ఆమె తండ్రే కాదు, మా అయ్య కూడా మనల్ని– ముఖ్యంగా నన్ను అసహ్యించుకుంటాడు. మనం చెంచు ముఠాతో యుద్ధం చేయకుండా నాగుమల్లిని రక్షించలేం. నువ్వు గూడేనికి పోయి మన వాళ్ళను పాతికా ముప్పయి మందిని వెంటబెట్టుకు రా. ఈ లోపల నేను కాలిజాడలను బట్టి పోయి, ఈ చెంచులు మల్లిని ఎక్కడికి తీసుకుపోతున్నదీ గమనిస్తాను,' అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో అభ్యంతరం చెప్పబోయాడుగానీ, శిఖిముఖి వినిపించుకోక, అతణ్ణి వేగిర పెట్టాడు. విక్రమకేసరి చేసేది లేక ఒక శబరుణ్ణి శిఖిముఖి వెంటవదిలి, తతిమ్మా ఇద్దరితో గూడేనికి బయలుదేరాడు.

శిఖిముఖి, చెంచులు పోయిన మార్గాన్ని కాలిజాడల వల్ల గుర్తిస్తూ, ఓ అరగంట తరవాత కొండపాదంలో వున్న ఒక అరణ్యప్రాంతాన్ని చేరాడు. అతడికి చెట్లచాటునుంచి ఏవో గొంతులు వినిపించినై.

అతడు వెంటవున్న శబరుణ్ణి నిశ్శబ్దంగా ఉండమని హెచ్చరించి, దాపుల నున్న ఒక చెట్టు ఎక్కి దిగువకు చూశాడు. చెట్లలో ఒక చోట పులిబోను ఒకటి ఉన్నది. చెంచులు నాగుమల్లిని దానికేసి మోసుకుపోతున్నారు.

(ఇంకా వుంది)






# పుణ్యమూ పురుషార్థమూ

వినోదాల పండుగ హోలీ వస్తోందనగానే పిల్లల్లో ఉత్సాహం ఉరకలు వేసింది. రవి మిత్రుడిని అడిగాడు. 'సూర్యం! హోలీకి రంగులు కొన్నావురా?' 'లేదురా. నువ్వొచ్చాక కలసి వెళ్దామని ఆగిపోయాను. పద ఇద్దరం వెళ్లి కొనుక్కుందాం' అన్నాడు సూర్యం. ఇద్దరూ భుజాలమీద చేతులు వేసుకుని కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు. ఉన్నట్టుండి రవికి క్రితం సంవత్సరం హోలీ పండుగనాడు జరిగిన విషయం గుర్తుకొచ్చింది.

'క్రితంసారి భలే తమాషా జరిగింది కదరా సూర్యం!' అన్నాడు. సూర్యానికి హోలీ రంగుల కోసం బయల్దేరినప్పుడే ఆ సంగతి గుర్తుకొచ్చింది. 'ఏం తమాషారా బాబూ రంగులెక్కువైపోయి ఆరోజు రోజంతా ఒకటే దురదలు.. భరించలేక రాత్రంతా తెగ దొర్లాం కదరా... ఎలా మర్చిపోతాం?' అన్నాడు సూర్యం ఆనాడు జరిగినది తలచుకుంటూ.

'రవి ఈసారి జాగ్రత్తగా ఉండాలిరోయ్.. లేకపోతే సరదా కాస్తా కొండెక్కుతుంది. అదిగో.. శంకర్ కూడా రంగుల కోసమే కాబోలు బయల్దేరాడు. చూడు' అన్నాడు మరో మిత్రుడిని చూసి. 'శంకర్ ఎక్కడికిరా అలా గోనె సంచీతో బయలుదేరావు? కొంపదీసి హోలీ రంగులకి కాదు కదా!' అంటూ మిత్రులిద్దరూ నవ్వినా ఎందుకోగానీ శంకర్ నవ్వలేకపోయాడు.

'అలా ఉన్నావేంరా..' ఆరా తీశాడు రవి. 'హోలీ పేరు వింటేనే నాకు ఏడుపొస్తోందిరా' విషాద వదనంతో అన్నాడు శంకర్.

'అదేంటిరా.. రంగుల పండగ ఎప్పుడొస్తుందా అని మేమెదురు చూస్తుంటే

పి.వి. శేషారత్నం

నువ్వలా అంటావేం?' విస్తుపోయాడు సూర్యం. 'క్రిందటి హోలీనాడే మా అన్నయ్యకి కళ్లు పోయాయిరా?' శంకర్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి. 'అరె.. ఎలాగా?' అన్నారు తక్కిన ఇద్దరూ. శంకర్ జేబు రుమాలుతో కళ్లు తుడుచుకుంటూ చెప్పాడు.

'ఆరోజు అందర్లాగే మేమూ హోలీనాడు రకరకాల రంగులు కొనుక్కుని పోటీలుపడి మరీ వసంతాలు చల్లుకున్నాం. కానీ... ఆ రంగు మా అన్నయ్య కళ్లల్లో పడిన మరుక్షణం కెవ్వుమంటూ పెద్ద పెద్ద కేకలు పెట్టాడు... ఆ రోజు గాఢమైన రంగు రావడానికి హోలీ రంగుల్లో నేనే కొన్ని రసాయనాలు కలిపాను. అందుకే మా అన్నయ్యకి కళ్లు పోయాయని చెప్పారు డాక్టర్లు.. ఏంటో.. అప్పటిదాకా మా అన్నయ్య క్లాసులోను, ఆటల్లోనూ ఎప్పుడూ ఫస్టు వచ్చేవాడు. కానీ ఇప్పుడో? విచారంగా తన గది నుంచి ఎప్పుడూ బయటికి రానే రాడు. ఒక్కోసారి గుండె తరుక్కుపోయేలా ఏడుస్తుంటాడు.'

'ఇది వింటుంటే హోలీ ఆడాలంటేనే నాకూ భయమేస్తోందిరా..' అన్నాడు సూర్యం వణుకుతూ. 'అంటే ఇంక మనమెప్పుడూ హోలీ ఆడనే ఆడకూడదా?' అన్నాడు రవి.

'ఆడాలి కానీ ఈ రంగులతో కాదు. మీరు నాతో వస్తే మీకే అర్థమవుతుంది' అన్నాడు శంకర్ అక్కడినుంచి కదులుతూ.

'ఎక్కడికి? మాకూ చెప్పవా?' అడిగాడు మిత్రులిద్దరూ.

'మన ఊళ్ళో మూడు దేవాలయాలున్నాయి కదా... దేవుడికి పూజ చేసిన బోలెడు



రంగు రంగుల పూలను మరునాడు పారే స్తారు కదా.. మన స్కూలు పర్యావరణ పరిరక్షణ సమితి సభ్యులం పదిమంది ఇవ్వాళ దేవాలయాలనుంచి వాటిని సేక రించి.. రంగులవారీగా వేరుచేసి వాటితో సహజమైన రంగునీళ్లు తయారు చేద్దామ నుకుంటున్నాం.'

సూర్యం కంఠంలో ఆనందం.. 'ఈ ఆలో చన బావుందిరా.. పోయిన పూలతో ఊళ్లో చెత్తని ఎక్కువ చేసే బదులు ఈ రకంగా హోలీ పండుగ చేసుకోవచ్చన్నమాట.'

రవి హుషారుగా మరోమాట చెప్పాడు.. 'నాకింకో ఆలోచన వస్తోందిరా... ఇకమీదట అలా సేకరించిన పూలను మన బళ్లోనే ఓమూల గొయ్యి తవ్వి అందులో వేసి పూడు స్తుంటే మన బడి తోటకు మంచి ఎరువుగా కూడా పని చేస్తుంది కదా..! ఒకవైపు ఎవరికీ హాని కలుగకుండా పండగ చేసుకోవచ్చు... మరోవైపు ఊరూ శుభ్రపడుతుంది. ఇంకో వైపు డబ్బు ఖర్చు లేకుండా మన బడి తోటకు ఎరువూ దక్కుతుందన్నమాట.. మన పెద్దవాళ్లు చెప్పే పుణ్యమూ పురు షార్థమూ ఇవే కాబోలు...' అంటూ నవ్వు కున్నారు ముగ్గురు మిత్రులూ.

* హోలీని జాగ్రత్తగా జరుపుకోండి. బురద, మురికినీరు, గుడ్లను ఉపయోగించ కండి.
* వృద్ధులు, పిల్లలపై రంగులు చల్లకండి. ఎవరినీ బలవంతపెట్టకండి. పండుగ సమయంలో, ఇతరుల స్వాతంత్ర్యాన్ని గౌరవించండి.
* కృత్రిమ రంగులను కలుపకండి. మీరు కొన్న రంగులను తనిఖీ చేయండి.
* మంచినీటిని వృథా పరచకండి.
* హోలీకి ఉన్న సాంస్కృతిక ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోండి. హోలీ అంటే రంగుల పండుగే కానీ ఆట కాదు.

హోలీని సంతోషంగా, సరదాగా గడపండి.





'ముకుల్' బాల విలేఖరులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఉత్సాహం పొంగిపొరలే ఈ పిల్లలను సహాయక విలేకరులుగా కలుపుకోవడాన్ని యునిసెఫ్, సుప్రిమెంటల్ ఫౌండేషన్ సంస్థలు సవాలుగా తీసుకున్నాయి.

ఈ కార్యక్రమం ప్రధానంగా బాలబాలికల భాగస్వామ్యంపైనే ఆధారపడింది, దీంట్లో ముకుల్ బాల విలేకరులు ముఖ్యమైన పాత్ర పోషించారు. బాలల హక్కులపై చైతన్యం పొందిన తర్వాత, తమ చుట్టూ జరుగుతున్న ఘటనలను అర్థం చేసుకుని, వాటిపై ఒక అవగాహనకు వచ్చి రాసి పంపవలసిన బాధ్యత ముకుల్ బాల విలేకరులపైనే పడింది. తమ ప్రాంతంలో జరుగుతున్న ప్రతి ఘటనను వీరు ఇకపై విలేకరుల దృక్పథం నుంచే చూడాలి.

ఈ విలేకరులు రాసే ప్రతిదాన్ని ప్రచురించవలసిన అవసరం లేదు కానీ, కొంత కాలం తర్వాత వీరి రచనలు వారి కమ్యూనిటీలో మార్పు తీసుకువచ్చే అవకాశం ఉంది. తాము నివసిస్తున్న కమ్యూనిటీలో మార్పు తీసుకురావడంలో ఈ బాల విలేకరులు ముఖ్యకారణం అవుతారు కూడా.

మరోసారి ముకుల్ బాల విలేకరులకు అభినందనలు, శుభాకాంక్షలు తెలుపుతున్నాను.

- డ్మాక్టర్ యోగిన్ మజుందార్

రాష్ట్ర ప్రతినిధి, బీహార్ యునిసెఫ్ కార్యాలయం



ప్రియమైన బాలపాఠకులకు,

యునిసెఫ్, సుప్రిమెంటల్ ఫౌండేషన్ మీకోసం ఒక విశిష్టమైన కార్యక్రమాన్ని తీసుకువచ్చాయి. అవును, ఇది మీగురించి మేం మాట్లాడే మీ వాణిని మోసుకుపోయే ఒక మాధ్యమం. బీహార్‌లోని వైశాలి జిల్లా నుంచి అరవై మంది పిల్లలు ఎంపిక చేయబడి మీ రాష్ట్రం పిల్లల తరపున మాట్లాడే అవకాశం దక్కించుకోవడం, పిల్లలందరి వాణిగా మారడం మీకు గర్వకారణం. పిల్లల హక్కులు, కుటుంబం, సమాజం, రాష్ట్రం గురించి అర్థం చేసుకోవడమే కాదు, ఈ హక్కులను అమలు చేయవలసిన బాధ్యత కూడా మీపైనే ఉంది.

మీలో శక్తి దాగి ఉన్నదని మాకు తెలుసు.దాన్ని మీరు గుర్తించాలి అంతే. కాని, దీనివల్ల మీ చదువుకు మాత్రం ఆటంకం కలగరాదు. శుభాకాంక్షలు.

- రాజేష్ కుమార్,

డైరెక్టర్, సుప్రిమెంటల్ ఫౌండేషన్

## బాలిక

జీవితమా! అమ్మాయికి తన ఇచ్ఛ ప్రకారం బతికే హక్కు ఉందో లేదో చెప్పవా?

మనం మానవులం, జంతువులం కాము!

తల్లిదండ్రులు మనకు జన్మనిచ్చారు. కాని, ఈ ప్రపంచంలో ఆడ పిల్లలకు ఎలాంటి ప్రాముఖ్యత లేదు ఎందుకని?

మెడకు పలుపుతాడు వేసి జీవితాంతం కట్టిపడేసి ఉంచే ఆవులతో, కూతుళ్లు సమానం అని తల్లి ఎందుకు చెబుతుంది? మన బాల్యం నుంచి మనకిలాంటి విషయాలు ఎందుకు చెబుతూ వస్తున్నారు?

జీవితమా! అమ్మాయికి తన ఇచ్ఛ ప్రకారం బతికే హక్కు ఉందో లేదో చెప్పవా?

కూతుళ్లు ఇతరులకు చెందవలసిన ఆస్తి అని తల్లి ఎందుకు చెబుతుంది? కూతుళ్ల సొంతచోటు వారి అత్తగారి ఇల్లే అని ప్రతి ఒక్కరూ ఎందుకు వల్లెవేస్తున్నారు? అమ్మాయికి తన కాళ్లమీద తాను నిలబడే హక్కు లేదా?

జీవితమా! అమ్మాయికి తన ఇచ్ఛ ప్రకారం బతికే హక్కు ఉందో లేదో చెప్పవా?

మాకూ కలలున్నాయి, కాని వాటిని నెరవేర్చుకునే స్వాతంత్ర్యం లేదు. మా స్వప్నాలు మావే అని లోకంలో ఎవరు గుర్తిస్తున్నారు? ఏదీ మాది కాదు. తన కాళ్లమీద తాను నిలబడే హక్కు అమ్మాయికి లేదా?

జీవితమా! అమ్మాయికి తన ఇచ్ఛ ప్రకారం బతికే హక్కు ఉందో లేదో చెప్పవా?

ఆడపిల్ల పుడితే ప్రతిఒక్కరూ ఏడుస్తారు. మనకు జన్మనిచ్చినవారే మనం మరొకరి సొత్తు అని చెబుతుంటారు. మరి అమ్మాయిలు తమకు తాము చేయగలిగిందేమిటి? ఇకనుండి ప్రపంచంలో మనం పుట్టబోయేముందు మనం అమ్మాయిలందరమూ... దేవుడి ఆమోదం పొందవలసి ఉంది.

జీవితమా! అమ్మాయికి తన ఇచ్ఛ ప్రకారం బతికే హక్కు ఉందో లేదో చెప్పవా?

– సురభి రాజ్

శివానందన్ గయా హయ్యర్ సెకండరీ స్కూల్, బాకార్పూర్

## బాల్యవివాహాలను ఆపండి

ఒకరోజు నేను మా ఊరిలో నడుస్తున్నప్పుడు పది, పన్నెండేళ్ల ప్రాయంలో ఉన్న చిన్నమ్మాయిని చూశాను. ఆమెను పలకరిస్తే బోరుమని ఏడవసాగింది. వెక్కిళ్లమధ్యనే ఆమె తనకు ముగ్గురు సోదరిలు, సోదరుడు ఉన్నారని తెలిపింది. తండ్రి నిరుపేద రైతు. వాళ్లమ్మ పొరుగిళ్లలో పనికి వెళుతుంది. తల్లి తనకు పెళ్లి చేసేయాలని అనుకుంటోంది. తనకేమో

బాగా చదువుకుని మంచి పౌరురాలు కావలని ఉంది. కాని పిల్లలకు తిండి పెట్టడానికి కూడా కాసులు లేని స్థితిలో తనకు చదువుకోసం డబ్బు ఎక్కడినుంచి తేవాలని అమ్మ వాపోతుంటుంది. అందుకే ఈ రోజునుంచి చదువుకుంటాను అనే మాటెత్తవద్దని తల్లి కూతురుతో తేల్చి చెప్పింది.

చిన్నారి బాధామయగాథ విన్నతర్వాత ఆ అమ్మాయి తల్లితో ఆ మరునాడే మాట్లాడాను. నేను కూడా చదువుకుంటున్నానని ఆమెతో చెప్పాను. చదువుకోవడానికి డబ్బు లేకపోవడం అనే సమస్య ఇప్పుడు లేదని, ఇప్పుడు ఆరునుంచి పద్నాలుగేళ్ల ప్రాయంలోని పిల్లలందరూ ఉచితంగా, నిర్బంధంగా చదువుకునేలా ప్రభుత్వం చట్టం చేసింది. స్కూలు యూనిఫారంకి, పుస్తకాలకోసం డబ్బులందిస్తోంది, పిల్లలకు సైకిల్ కూడా ఇస్తోంది. మధ్యాహ్నం భోజనంతోపాటుగా పిల్లలకు ప్రభుత్వం అనేక సౌకర్యాలు కల్పిస్తోంది. తన కూతురును బడికి పంపితే ఏ ఖర్చూ ఉండదని ఆమెకు వివరించాను. ఆమెను బతిమాలాను. ''దయచేసి పాపకు పెళ్లి చేయవద్దు. తనకు 18 ఏళ్లు వచ్చిన తర్వాతే పెళ్లి గురించి ఆలోచించండి. ఇప్పుడు మాత్రం ఆమెను చదువుకోనీయండి.''

అందుకు ఆమె తల్లి అడిగింది. ''మరి వంట ఎవరు చేస్తారు?'' ''మీరే వంట చేయండి,'' అన్నాను. అప్పుడామె కోపంతో నన్ను నిందిస్తూ, ''పిల్లలను ఎవరు చూసుకుంటారు?'' అని అరచింది. నేను జవాబిస్తూ, ''పాపే వంట చేసి బడికి వెళుతుంది. మీరు మాత్రం పిల్లలను చూసుకోండి.'' అన్నాను. వాళ్లమ్మ చాలాసేపు ఆలోచించి చివరకు ఒప్పుకుంది. ''అలాగైతే నేను పాపను బడికి పంపిస్తాను. నేను దానికి ఇప్పుడే పెళ్లి చేయను. తను కూడా నీలాగే బాగు చదువుకుంటుంది.'' అన్నది వాళ్లమ్మ. నేనారోజు సంతోషంగా ఇంటికెళ్లాను. ఈ రోజు ఆ చిన్నారి నా స్నేహితురాలు, తను ప్రతిరోజూ బడికి వెళుతోంది కూడా.

శివసాగర్ విద్యాలయ మందిర్, రామ్‌దౌలి, బిడుపూర్, బీహార్

---

ప్రస్తుతం విద్యకు ప్రాధాన్యత బాగా పెరిగింది. పురుషులు మాత్రమే విద్య గడించడం అంత ముఖ్యమైన విషయం కాదు. మహిళలు విద్య నేర్చుకోవడానికి కూడా అంతే ప్రాధాన్యత ఉంది. కుటుంబభారం మోయడం స్త్రీపురుషులిరువురిమీద ఉంది. చదువు నేర్చుకున్న మహిళ తన పిల్లల చదువును చక్కగా ప్రభావితం చేయగలదు. విద్యలేని మహిళ తన పిల్లలకు చదువు చెప్పించడం కష్టసాధ్యం.

విద్యావంతురాలు తన కుటుంబ ఆదాయాన్ని రెట్టింపు చేయగలదు. రోజువారీ జీవితంలో ఖర్చు పెరుగుతోంది. మగవాడు మాత్రమే ఎలా సంపాదించగలడు? కుటుంబంలో మహిళ కూడా సంపాదించగలిగితే జీవితం సాఫీగా నడుస్తుంది.

విద్యావంతురాలి మాటలను సమాజం వింటుంది కూడా. ఆమె తన కుటుంబానికి,

దేశానికి సంబంధించిన పలు విషయాలపై తన అభిప్రాయాన్ని స్పష్టం చేయగలుగుతుంది. ఉదాహరణకు విద్యావంత మహిళ ఆసుపత్రిలో రోగికి ఇచ్చిన మందుల పేర్లను చదవగలదు. ఇది పురుషులు మాత్రమే పనిచేయగలిగిన కాలం కాదు. గతంలో పురుషులు మాత్రమే చేయగలిగిన పనులను ఇప్పుడు మహిళలు కూడా చేయగలరు. మహిళలు సైనికులుగా, టీచర్లుగా మరెన్నో వృత్తులను చేపడుతున్నారు. జీవితంలో ఎదురయ్యే అన్ని కష్టాలను స్త్రీలు తమ ఆత్మవిశ్వాసంతో సాధించగలుగుతున్నారు.

తమ కుటుంబాలు, సమాజం, ఇతరదేశాలకు సంబంధించి లోకజ్ఞానం విషయంలో విద్యావంత మహిళలు మంచి ఉదాహరణలుగా నిలుస్తున్నారు. ఎందుకంటే విద్య పెరిగేకొద్దీ మహిళల స్వేచ్ఛ కూడా పెరుగుతుంది. స్త్రీవిద్యతో దేశ శక్తి రెట్టింపవుతుంది.

నగరాలలో విద్య సాధించటంలో మహిళలు ముందంజవేస్తున్నారు. సరోజినీ నాయుడు, ఇందిరాగాంధీ, జయలలిత, మమతా బెనర్జీ వంటి పేర్లు తెలియని వారెవ్వరు? ఈ మహిళలు పురుషులను అనేక అంశాలలో అధిగమించారు. ఇవ్వాళ నగరాలలోని మహిళలతో పాటు గ్రామాలలోని మహిళలను కూడా విద్యావంతులను చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

విద్య మానవులకు లోకజ్ఞానం నేర్పుతుంది. కుటుంబాలలో, సమాజంలో, స్వదేశంలో, విదేశాలలో కూడా విద్యావంతులయిన మహిళలు లోకజ్ఞానానికి సంబంధించి మంచి ఉదాహరణలుగా నిలుస్తున్నారు. ఇప్పుడు మహిళలు ప్రాధాన్యత లేనివారు కాదు. వాళ్లు దుర్గాదేవిగా మారారు. స్త్రీపురుషులు ఇరువురికీ విద్య నేర్పడం అవసరం. మహిళ విద్య పొందేకొద్దీ జీవితంలో వారికి స్వేచ్ఛ కూడా పెరుగుతుంది. మహిళలు విద్య పొందడం ద్వారా దేశ బలం కూడా రెట్టింపవుతుంది. అందుచేత ప్రభుత్వం మహిళలందరికీ ఉచిత విద్యను అందించాలి.




**Liked what you read? Send your comments / queries to**

Vibhavari
Sai Estate Colony, D.P.N Bhargav House
Nanakhedi, Guna, Madhya Pradesh Pin- 473001.




**Send us your feedback!**

CHANDAMAMA INDIA LTD.,
B-3, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.
Phone : +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com



# ధర్మయ్య పరీక్ష

రామాపురం గ్రామంలోని ధర్మయ్య గొప్ప స్థితిమంతుడేకాగ, పేరుకు తగినట్టు మంచి ధర్మబుద్ధికలవాడు. ఆయనకు పెళ్ళీడు కొచ్చిన విశ్వం అనే ఒకే ఒక కొడుకున్నాడు. విశ్వం రూపవంతుడేకాక, మంచి గుణవంతుడు కూడా. అతడికి తగిన రూపవతి, గుణవతి అయిన కన్య కోసం ధర్మయ్య వెతకసాగాడు.

ధర్మయ్యకు అదే గ్రామంలో వెంకప్ప అని ఒక స్నేహితుడున్నాడు. వెంకప్ప జరీ చీరలు ఇంట్లో మగ్గాలమీద నేయించి, చుట్టుపక్కల గ్రామాలకు తీసుకుపోయి అమ్ముతూ ఉండేవాడు. వాటిని కాస్త కలిగిన గృహస్థులందరూ కొనేవారు. ఆ కారణంగా వెంకప్పకు చాలా గ్రామాల్లోని ఆస్తిపరుల గురించి బాగా తెలుసు.

ఒకసారి అతడు ధర్మయ్యతో, 'నువ్వు విశ్వానికి పిల్లను వెతుకుతున్నావని తెలిసింది. పేరవరంలోని రాజయ్యగారికి కమల అని అందమైన అమ్మాయి ఉన్నది. వీరవరంలోని రామయ్యగారికి సరళ అనే చక్కని కూతురుంది. వీళ్ళిద్దర్నీ నువ్వూ, విశ్వం ఒకసారి వెళ్ళి చూసి, ఇద్దర్లో నచ్చినవారిని ఒకరిని ఎన్నుకుంటేసరిపోతుంది. రాజయ్య, రామయ్యలిద్దరూ కూడా సంప్రదాయాల్లో, ఆస్తిపాస్తుల్లో నీకు సరితూగగలవారు,' అన్నాడు.

ధర్మయ్య, వెంకప్ప చెప్పిన విధంగా విశ్వాన్ని వెంటబెట్టుకుని, రెండు గ్రామాలకూ వెళ్ళి కమల, సరళలను చూసి వచ్చాడు. ఇద్దరూ ఒకరినిమించి ఒకరు అందగత్తెలుగా తోచారు. విశ్వం ఆ ఇద్దర్లో

గవ్వల నిర్మలాదేవి

ఎవర్నో ఒకర్ని వధువుగా ఎన్నుకునే భారం తండ్రిమీద ఉంచాడు. ధర్మయ్యకు ఆ ఇద్దర్లో ఎవర్ని కోడలిగా తెచ్చుకోవాలన్నది పెద్ద సమస్యగా పరిణమించింది.

ఆయన వెంకప్పతో, 'ఈ కోడల్ని తెచ్చుకోవడం అనేది, పెద్దసమస్యగా తయారైంది వెంకప్పా! కమల, సరళ ఇద్దరూ మంచి అందగత్తెలే, కానీ.. అందం శాశ్వతం కాదు గదా. అందుకని, వాళ్ళిద్దరి గుణగణాలకు చిన్న పరీక్ష ఒకటి పెట్టి, అందులో నెగ్గిన పిల్లను నా కోడలుగా తెచ్చుకోవాలనుకుంటున్నాను. ఇందుకు నీ సాయం కావాలి,' అన్నాడు.

అందుకు వెంకప్ప నవ్వి, 'నా సాయమా, దానికేం! ధర్మసూక్ష్మాలెన్నో తెలిసినవాడివని, నీకు మంచి పేరున్నది. నీలాంటి స్నేహితుడికి సాయపడడంకంటే నాక్కావలసినదేముంది,' అన్నాడు.

అప్పుడు ధర్మయ్య, వెంకప్పకు చేయవలసిందేమిటో వివరించాడు.

వెంకప్ప, ధర్మయ్య చెప్పిన విధంగా కొన్ని కొత్త నమూనా జరీచీరలు తీసుకుని, మొదట పేరవరం వెళ్ళాడు. కమల, వెంకప్పను చూస్తూనే, 'కొత్తరకం చీరలు ఏమైనా తెచ్చావా?' అని అడిగింది.

వెంకప్ప చీరలమూట విప్పుతూ, 'కొత్తరకం చీరలు ఏవైనా నేయగానే, మొదట చూపేది మీకేగదమ్మా!' అని, చీరలను కమలముందు ఉంచాడు.



కమల కొత్త జరీ చీరలను చూసి చాలా ముచ్చటపడింది. వెంకప్ప వాటిలోంచి ఒక చీర తీసి కమలకిస్తూ, 'ఇది తీసుకోండి అమ్మాయిగారూ, మీకు బాగా నప్పుతుంది. జరీనేత కూడా దట్టంగా ఉన్నది. కట్టుకు చూశాక, నా ఎన్నికను మీరు తప్పకమెచ్చుకుంటారు,' అన్నాడు.

కమల చీర తీసుకుని, 'మరి ఈసారి రవిక ముక్కలు తెచ్చినట్టులేదే! తెచ్చి ఉంటే, చీరకు తగిన రవిక కూడా తీసుకునేదాన్ని కదా,' అన్నది.

దానికి వెంకప్ప తల గోక్కుని, 'అవును మరి! కాని, రవికకు పనికొచ్చే గుడ్డ మగ్గం మీద ఉన్నది. వారం పదిరోజుల్లో తప్పక తెచ్చిస్తాను,' అని చీర ఖరీదు తీసుకుని



వీరవరం వెళ్ళాడు. అక్కడ రామయ్య కూతురు సరళకు కూడా, వెంకప్ప తెచ్చిన జరీ చీరలు బాగా నచ్చినాయి. అతడు, ఆమెకు ఒక చీర ఇచ్చి, 'అమ్మాయిగారూ, దీనికి తగిన రవిక గుడ్డ వారం రోజుల్లో తెస్తాను. దయచేసి ఈలోగా తొందరపడి ఎవరిదగ్గిరా కొనకండి. ఈ చీరకు నప్పే రవిక గుడ్డ మగ్గం మీద ఉన్నది,' అని చెప్పాడు.

సరళసరేనని చీర, డబ్బు తెచ్చి ఇచ్చింది. వెంకప్ప స్వగ్రామం చేరాడు. రెండు వారాలు ఆగి, ధర్మయ్య చెప్పిన మీదట కమల, సరళల చీరలకు తగిన రవికగుడ్డలు తీసుకుని మళ్ళీ బయలుదేరాడు.

అతడు కమలవద్దకు వెళ్ళి, 'అమ్మాయిగారూ, మీరు కొన్న చీరకు తగిన రవికగుడ్డ తెచ్చాను, చూడండి!' అన్నాడు. అయితే కమల, అతడితో 'అక్కర్లేదులే వెంకప్పా! రవికగుడ్డ మరొకరి దగ్గిర కొన్నాను,' అన్నది.

వెంకప్ప సరేనని బయలుదేరి సరళ ఇంటికి వెళ్ళాడు. సరళ అతణ్ణి అంతదూరాన చూస్తూనే, 'రవికగుడ్డ తెచ్చినట్టున్నావు, అవునా?' అని అడిగింది.

'అవును, తెచ్చాను అమ్మాయిగారూ కాస్త ఆలస్యం అయింది. మీరు మరొకచోట కొనుక్కోలేదు గదా?' అని అడిగాడు వెంకప్ప.

సరళ నవ్వుతూ, 'ఇంత మతిమరుపు మనిషి వేమయ్యా, వెంకప్పా! చీరలోనే రవికగుడ్డ కూడా మడతవేసి ఉన్నది. నువ్వు వెళ్ళాక చీరమడతలన్నీ విప్పుతుంటే, రవిక గుడ్డ కిందపడింది. ఇదుగో, చూడు!' అంటూ గదిలోకి పోయి రవికగుడ్డ తెచ్చి చూపించి, 'ఆ రోజున నీకు చీర ఖరీదే ఇచ్చాను. ఈ రవిక ముక్క ఖరీదేమిటో చెప్పు, ఇస్తాను,' అన్నది.

వెంకప్ప తల గోక్కుంటూ, 'మరిచేపోయానమ్మాయిగారూ! పెద్దవాణ్ణయిపోతున్నా గదా,' అంటూ రవికగుడ్డ ఖరీదు తీసుకుని తిరుగుప్రయాణమయ్యాడు.

వెంకప్ప గ్రామానికి తిరిగివస్తూనే, ధర్మయ్య దగ్గిరకుపోయి జరిగినదంతా చెప్పాడు. అంతా విని ధర్మయ్య తృప్తిగా తలాడించి, 'నాకాబోయే కోడలెవరో తేలిపోయింది వెంకప్పా! మంచి ముహూర్తం

చూసుకుని, తాంబూలాలు మార్చుకోవడా నికి బయలుదేరాలి,' అన్నాడు.

వెంకప్ప 'ఇంతకూ నువ్వు ఏ అమ్మా యిని కోడలుగా చేసుకోబోతున్నావో నాకు అంతుబట్టడం లేదు,' అన్నాడు.

అప్పుడు ధర్మయ్య 'నువ్వు మొదట నేను ఇవ్వమన్న చీరలను కమలకొకటీ, సరళకొకటీ ఇచ్చావు గదా?' అన్నాడు.

'అవును, నువ్వు ఇవ్వమన్న చీరలనే వాళ్ళకు, వాటిని గురించి కాస్త పొగిడి ఇచ్చి వచ్చాను' అన్నాడు వెంకప్ప.

'ఆ రెండు చీరల్లోనూ, మనం వాటికి నప్పే రవిక ముక్కలను కూడా ఉంచి మడత వేసినసంగతి నీకు గుర్తులేదా? ఆ విషయం అప్పుడే మరచి పోయావా? అని అడిగాడు ధర్మయ్య.

వెంకప్ప ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, 'ఆ ఇప్పుడు తెలిసింది. నీ కాబోయే కోడలు సరళ అన్నమాట!' అన్నాడు.

'బాగా గ్రహించావు వెంకప్పా! సరళ కున్న నిజాయితీ, కమలవద్ద కొరవడింది. కమల చీర మడతల్లో ఉన్న రవికముక్కను దాచుకున్నది.

అందువల్లనే నువ్వు తిరిగి అమ్మడా నికి వెళితే, తాను మరొకరి దగ్గిర కొన్నానని అబద్ధం చెప్పింది. నిర్భయంగా జీవితంలో ఇటువంటి చిన్న చిన్న విషయాల్లోనే మను షుల అసలు బుద్ధులు వెల్లడవుతుం టాయి. సరేగానీ, కమలకిచ్చిన రవికగుడ్డ ఖరీదెంతో చెప్పు ఇస్తాను.' అన్నాడు ధర్మయ్య.

వెంకప్ప సంతోషంగా, 'భలేవాడివి ధర్మయ్యా! దాని ఖరీదు నాకిస్తావా? నీ మనసుకు నచ్చిన కోడలు దొరకడానికి, ఉడతాభక్తిగా నేనేదో చిన్న సాయం చేశానన్న తృప్తి నాకు చాలు,' అన్నాడు.

ఆ తర్వాత ధర్మయ్య కొడుకు విశ్వానికీ, సరళకూ వైభవంగా వివాహం జరిగింది.





# బంగారు ఎలుక

ప్రతిష్టానదేశంలో సుప్రతిష్ఠితం అనే గొప్ప నగరం ఉండేది. ఆ నగరంలో ఒక వైశ్య స్త్రీ ఉండేది. ఆమె భర్త చనిపోగానే దాయాదులు అతని ఆస్తి యావత్తూ కాజేశారు. భర్త పోయేనాటికి ఆమె గర్భవతిగా ఉండి, అనంతరం ఒక కుమారుణ్ణి కన్నది. ఆమె అష్ట కష్టాలుపడి ఆ కొడుకును పెంచి పెద్దజేసింది. కొడుకు పెద్దవాడయ్యాక ఒకనాడు తల్లి వాడితో ఇలా చెప్పింది:

''నాయనా, నీవు వైశ్య కుమారుడివి. వ్యాపారం మన కులవృత్తి. దురదృష్టవశాత్తూ నీవు ఆగర్భదరిద్రుడవు. అందుచేత వ్యాపారానికి అవసరమైన పెట్టుబడి ధనం లేదు. అయితే ఈ నగరంలో ధనగుప్తుడు అనే కోటీశ్వరుడున్నాడు. పేద వ్యాపారుల బిడ్డలకు సహాయం చేస్తాడు. ఆయన దర్శనం చేసుకుని పెట్టుబడికి ధనం తెచ్చుకో!''

తల్లి చెప్పినట్లే ఆ వ్యాపారిబిడ్డ ధనగుప్తుడిని చూడబోయాడు. ఆ సమయంలో ఆ కోటీశ్వరుడు మరొక యువకుణ్ణి కోప్పడుతున్నాడు:

''నీకు కొంచెమైనా వ్యాపారదక్షత లేదు. నీకు ఎన్నిసార్లో ధనసహాయం చేశాను. దాని మీద లాభం సంపాదించలేకపోగా, నేనిచ్చినది కూడా పోగొట్టుకున్నావు. తెలివిగలవాడివైతే ఆ చచ్చిన ఎలుకను పెట్టుబడిగా చేసుకుని లక్షలు సంపాదించవచ్చు.''

ఈ మాటలు వింటున్న కుర్రవాడు ధనగుప్తుడిని ధనం అడగలేదు. దూరాన చచ్చి పడి ఉన్న ఎలుకను తీసుకొన్నాడు.

దానిని తీసుకుపోయి ఒక వర్తకుడి పిల్లికి ఆహారంగా ఇచ్చి, దానికి ప్రతిఫలంగా రెండు దోసిళ్ళ శెనగలు పుచ్చుకొన్నాడు. వాటిని వేయించి కారపు శెనగలు చేసి, ఒక

ఉషా వెంకటరమణ

మంచినీళ్ల కుండ తీసుకుని, ఊరి బయటికి వెళ్ళి ఒక చెట్టునీడలో కూర్చున్నాడు.

మిట్టమధ్యాహ్నంవేళ అడవిలో కట్టెలు కొట్టుకుని వచ్చేవాళ్లు అక్కడికి వచ్చి ఆ చెట్టునీడనే కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు. కుర్రవాడు వారి యోగక్షేమాలు విచారించి, తలా కాసిని కారపు శెనగలు పంచిపెట్టి తాగేందుకు మంచినీళ్లు ఇచ్చాడు. అందుకు వాళ్ళు ఎంతో సంతోషించి తలా రెండు కట్టెలు కుర్రవాడికి ఇచ్చి వెళ్ళిపోయారు.

ఈ విధంగా సంపాదించిన కట్టెలు చిన్న మోపు కట్టి కుర్రవాడు కూడా నగరంలోకి తిరిగివచ్చి, వాటిని అమ్మి, ఆ డబ్బులో కొంతపెట్టి మళ్లీ శెనగలు కొన్నాడు. ఇలా కొన్నాళ్ళు జరిగాక అతను కట్టెలమోపులే కొనదగినంత ధనం కూడబెట్టాడు.

తరువాత కారపు శెనగల బేరంమాని కట్టెలమోపులు కొని భద్రం చేశాడు. ఇంతలో వర్షాకాలం వచ్చింది. కట్టెలకు గిరాకీ హెచ్చింది. తాను కొన్న కట్టెలన్నీ అమ్మేసి ఆ డబ్బుతో ఒక చిల్లర దుకాణం పెట్టాడు.

ఇలా, చిన్నస్థాయిలో మొదలైన చిల్లర వ్యాపారం రానురానూ పెద్ద వర్తకంగా పరిణమించింది. వర్తకాన్ని బాగా పెంచుకుని, దానిమీద వచ్చే లాభాలతో ఇళ్ళూ, వాకిళ్ళూ, తోటలూ, దొడ్లూ కొని కాలక్రమాన ఆ కుర్రవాడు లక్షాధికారి అయినాడు. అతని సంపదకు మూలం ఒక మామూలు ఎలుక కనుక అందరూ అతన్ని ఎలుక శెట్టి అని పిలవసాగారు.

తర్వాత ఎలుక శెట్టి ఒకనాడు బంగారంతో ఒక ఎలుకను చేయించి దానిని తీసుకొని వెళ్ళి ధనగుప్తుడికి సమర్పించి, "అయ్యా! ఇది మీరు నాకు చూపిన పెట్టుబడి. దీనివల్ల నేను చాలా ధనం గడించాను. వడ్డీతో సహా దీనిని మీకు తిరిగి ఇస్తున్నాను" అన్నాడు.

ఎలుక శెట్టి కథ యావత్తూ విని ధనగుప్తుడు అతని తెలివితేటలకూ, సద్బుద్ధికీ సంతోషించి, తన కుమార్తెను అతనికిచ్చి పెళ్ళిచేస్తూ, ఆ బంగారు ఎలుకనే అల్లుడికి కానుకగా ఇచ్చాడు.






# పరివర్తన

పోలయ్య ఒంటెద్దుబండి తోలే ఒకపేద పల్లెవాడు. ప్రతిరోజూ తన ఒంటెద్దుబండిని బాడుగకు తోలుతూ వారిచ్చే రూకలకు భార్య తెచ్చే డబ్బు తోడుకాగా తృప్తిగా జీవనం గడపసాగాడు. వారికొక కొడుకు పుట్టాడు. పేరు బంగారుస్వామి. వాడిని అల్లారు ముద్దుగా పెంచసాగారు. వాడు పెరిగి పెద్ద వాడవుతుండగా, పట్నంలో చదివే పిల్లలను చూసి తమబిడ్డనూ అలా చదివించాలనే కోరిక రోజు రోజుకూ పెరగసాగింది.

పోలయ్య రాత్రులు సైతం బండితోలుతూ కొంతసొమ్ము వెనకేయసాగాడు.

బంగారు స్వామికి ఐదేళ్ళు రాగానే పోలయ్య వాణ్ని పట్నంలోని కాన్వెంట్ స్కూల్‌లో చేర్పించాడు. క్రమంగా వాడు క్లాసులు మారుతూ హైస్కూల్‌కు వచ్చాడు. వాడి ట్యూషన్‌పూర్తయి రాత్రి పూట ఇంటికి తిరిగొచ్చేప్పుడు పోలయ్య మెత్తటి దిండ్లు వేసి కొడుకును కూర్చోబెట్టి బండి తోలేవాడు. పోలమ్మ లాంతరు దారిపొడవునా ఎత్తిపట్టు కోగా బంగారు స్వామి చదువుతూ ఉండేవాడు. వాడు ఇంగ్లీష్ మాట్లాడుతుంటే కళ్ళతో సైగలు చేసుకుంటూ ఆనందించేవారు.

బంగారు స్వామి కాలేజ్ చదువులకు వచ్చాడు, పోలయ్య దంపతులకు ఆనందం పట్టతరం కావడంలేదు. మరికొంతకాలం శ్రమిస్తే, బంగారు స్వామి చదువు పూర్తయి, ఉద్యోగంలో చేరితే తమ కష్టాలు గట్టెక్కు తాయనీ, కలలు కనసాగారు. ఓరోజున బంగారు స్వామి తనకు ఇంటికి రాను పోను కాలం వృథా ఔతున్నందున సమయం చాలడం లేదని బాధపడగా పోలయ్య వాడిని హాస్టల్‌లో ఉంచాడు. డబ్బు అధి కంగా అవసరమై ఎద్దును బండిని వచ్చిన

ఆదూరి హైమవతి

కాడికి అమ్మేసి ఆడబ్బంతా వాడి హాస్టల్ ఫీజు క్రింద ఒకేసారి కట్టేశాడు. రాత్రులు ఒకషాపు వద్ద కాపలాకి కుదిరాడు. పోలమ్మ సైతం రాత్రులు వంట పనికి కుదిరింది. క్రమంగా నిద్రలేమి వలన పోలయ్య ఆరోగ్యం క్షీణించ సాగింది.

ఓరోజున వారిద్దరూ బంగారు స్వామికి డబ్బు ఇవ్వడానికి కాలేజ్‌కి వెళ్ళారు. వారి బట్టలు, తీరు చూసి వాచ్‌మన్ లోనికి వెళ్ళ నీయలేదు. చివరకు బ్రతిమాలి మూడు గంటలు వేచి ఉండి లంచ్ సమయానికి లోనికి వెళ్ళగా, హాస్టల్ నుండీ భోజనం చేసి స్నేహితులతో కలసి వస్తున్న బంగారుస్వామి మెరిసి పోయే దుస్తుల్లో కనిపించాడు. 'నీకోసం ఇక్కడే కాసుకోనున్నాం, ఎట్టున్నవ్ రా!' అని పలకరించగానే , స్నేహితులు 'ఎవర్రా! ఈ అడవి మనుషులు! నిన్ను 'బిడ్డ' అంటున్నారు,' అని ప్రశ్నించారు.

'డియర్ ఫ్రండ్స్! వీళ్ళు మా పాలేర్లు ! మాఫాదర్‌కు ఖాళీ లేక వీళ్ళు పనిమీద సిటీకి వస్తుంటే డబ్బిచ్చి పంపినట్లున్నారు,' అనివారితో చెప్పి, అమ్మనాన్నలను దూరంగా తీసుకు వెళ్ళి, 'ఎందుకొచ్చారిక్కడికి నేను రాత్రికి వచ్చి డబ్బు తీసుకునే వాడ్నికదా, నాఫ్రండ్స్ ముందు నా పరువు తీయకండి. మరెప్పుడూ ఇక్కడికి రాకండి. నాకు స్కాలర్ షిప్ వస్తున్నది. మీరిచ్చే డబ్బు కేవలం హాస్టల్ కే. నేనే వచ్చి తీసుకుంటాను మరెప్పుడూ ఈకాలేజ్ ఛాయలకు రాకండి. వెళ్ళండిక,' అని కోపించి డబ్బు తీసుకుని విసవిసావెళ్ళి పోయాడు.




బిత్తరపోయిన పోలయ్య దంపతులు బయటికి వచ్చి కుమిలి కుమిలి ఏడ్చుకుని ఇంటిముఖం పట్టారు. మళ్ళీ తమ పల్లెలోని ఇంటికి మకాం మార్చుకున్నారు. పోలయ్య దిగులుతో ఏ పనీచేయలేని స్థితికి వచ్చాడు. పోలమ్మ మాత్రం కూరలు అమ్మి వచ్చిన డబ్బుతో ఇల్లు గడపసాగింది.

ఓరోజున కూరలు అమ్మడానికి పట్నం వెళ్ళిన పోలమ్మకు వారి ఊరి కుమరయ్య కనిపించి, 'పోలమ్మా! నీకు తెల్సా! ఈ రోజున మనపిల్లల కాలేజ్‌లో మనవాళ్ళకు ప్రైజులు ఇస్తారంట. మావాడు చెప్పాడు, వాడూ అక్కడే చదువుతున్నాడుగా! మిమ్మల్ని చూసేగా నేనూ నాకొడుకును పట్నంలో చదివిస్తున్నది! చాలా సంబరంగా ఉంటుంది. నేనూ వస్తాగా మనందరం కలిసెల్దాం' అని చెప్పాడు.



ఆరోజున పోలమ్మ, పోలయ్య ఉన్నంతలో మంచి గుడ్డలు వేసుకుని కుమరయ్య, అతడి కొడుకు వినయ్‌తోపాటుగా కళాశాలకివెళ్ళారు. అది చాలా పెద్దసభ. పోలయ్య దంపతులను, కుమరయ్య కొడుకు తీసుకెళ్ళి తన తండ్రితోపాటుగా కుర్చీల్లో కూర్చోబెట్టాడు. పెద్దపెద్ద చదువులు చదివినవారంతా రాసాగారు. కలెక్టర్, ప్రధానోపాధ్యాయులు, అధ్యాపకులు, పిల్లల తల్లిదండ్రులు ఎంతోమంది కార్లలో వచ్చారు. వారిని చూస్తున్న పోలయ్య దంపతులకు తమని తాము చూసుకుని భయమేసింది.

కాస్సేపటికి సభ మొదలైంది. ఏదేదో ఇంగ్లీషులో చెప్పారు అంతా. బాగా చదివిన పిల్లలందరికీ బంగారుపతకాలు, పెద్దపెద్ద పుస్తకాలు ఇచ్చారు, పెద్దగా చప్పట్లు కొట్టారు. బంగారు స్వామి కూడా స్టేజ్ పైకి మంచి సూట్‌తోవచ్చి పతకాలు తీసుకున్నాడు. వాడి వైభవం వాడి అందం, దర్జా చూసి పోలయ్య దంపతులకు ఆశ్చర్యమేసింది. తన కొడుకు వినయ్ కూడా స్టేజ్ పైకివచ్చి బహుమతులు, పతకాలూ తీసుకుంటుంటే కుమరయ్య సంతోషం పట్టలేక లేచి చప్పట్లు కొట్టాడు.

చివరకు కలెక్టర్ గారు లేచి తెలుగులో 'విద్యార్థులారా! మనలను కష్టపడి చదివించిన మన తల్లి దండ్రులను మనం పెద్ద చదువులు చదివి, ఉద్యోగాల్లో చేరగానే మరచిపోరాదు. వారిలో కొందరు కూలీ నాలీ చేసి మిమ్మల్ని చదివించిన పేదలై ఉండవచ్చు. వారి పేదరిక స్థితికి సిగ్గుపడక, వారిని ధైర్యంగా, మీతల్లితండ్రులుగా అందరికీ పరిచయం చేయాలి. వారి మనస్సులో మీ పట్ల ఉన్న ప్రేమను, మీకోసం వారు శ్రమించిన తీరును మరువక వారికి సేవచేయడం, వారిని ఆదరించడం బిడ్డలుగా మీ కర్తవ్యం. ఇక్కడ పేద తల్లిదండ్రుల బిడ్డ లెవరైనా ఉంటే వారిని స్టేజ్ పైకి పిలిచి మా అందరికీ పరిచయం చేయగల కృతజ్ఞతగల విద్యార్థులుంటే రావచ్చు.' అని చెప్పారు.

వినయ్ స్టేజ్ పైకి వచ్చి, 'సార్ ! మా నాయనగారు ఇక్కడే ఉన్నారు, పిలవనా' అని అడగ్గా, కలెక్టర్ గారు 'వెంటనేపిలువు' అనిచెప్పారు. అందరూ చూస్తుండగా, కుమరయ్య వేదిక పైకి వెళ్ళాడు. కలెక్టర్ కుమరయ్యతో చేయి కలిపి 'మీరేమైనా మాట్లాడుతారా!' అని అడిగాడు. రంగు మారిన గళ్ళ పంచతో, బనియన్‌తో ఉన్న

కుమరయ్య 'అయ్యా! మీలాగా నేను మాట్లాడలేను కానీ, మా ఊరి సోమయ్యన్న తన కొడుకును ఇట్టా పట్నంలో చదివించడం చూసి, నేనూ నా కొడుకును చదివించినా. మా వాడింత వాడైనందుకు నేను సోమయ్యన్నకు దండంపెట్టాలి. ఎందుకంటే సోమయ్యన్నను చూసే నేనూ నాబిడ్డను చదివించాలని అనుకున్నా. నేను చదువుకున్నోడ్నికాదు, తప్పులుంటే మన్నించాలి.' అని చెప్పాడు.

వినయ్ తన తండ్రిపాదాలకు నమస్కరించి 'ఈరోజు నుండీ మాతండ్రిని కూలి పనులకు పంపక నీడపట్టున ఉంచి బాగా చూసుకుంటానని మీ అందరి సమక్షంలో మాట ఇస్తున్నాను' అని చెప్పాడు. కలెక్టర్ గారు 'మిమ్మల్ని స్పందింపజేసి బిడ్డను చదివించడానికి ప్రేరేపించిన ఆ పోలయ్యన్నను చూడాలనుంది. పిలుస్తారా!' అని కోరగా, వెంటనే వినయ్ క్రిందికి దిగివచ్చి, పోలయ్య దంపతుల్ని చేతులు పట్టుకుని పైకి తీసుకెళ్ళాడు, వారు వద్దని ఎంత బ్రతిమాలుతున్నా.

స్టేజ్ మీదకు వచ్చిన, పోలయ్య దంపతుల్ని చూసి, కలెక్టర్ గారు వారికి నమస్కరించారు. 'ఇక్కడ వీరిబిడ్డ ఉంటే కనీసం ఇప్పుడైనా వచ్చి తన తల్లి తండ్రులను పరిచయం చేసుకోడం మంచిది.' అని చెప్పి కాస్సేపు చూశారు. 'చదువు సంస్కారాన్ని నేర్పాలేగాని, గర్వాన్ని పెంచకూడదు. నాతల్లి దండ్రులూ కూలి చేసి నన్ను చదివించారు. నేనింత వాడినైనందుకు ఎంతో గర్వించారు, వారి శ్రమ, మమత, అభిలాష, తమబిడ్డపై ఉన్న ప్రేమ నన్ను నావృత్తికి అంకితంచేసి, వారి సేవ చేసుకుంటూ నాధర్మాన్ని పాటించేలా చేశాయి. దేవుడు మీ బిడ్డను ఆశీర్వదించు గాక;' అని చెప్పారు.

మీటింగ్ పూర్తయి అందరూ వెళ్ళసాగారు. పోలయ్య దంపతులు, కుమరయ్య, వినయ్‌తోకలిసి గేటుదాటాక, ఎప్పటినుంచో అక్కడవేచి ఉన్న బంగారు స్వామి వచ్చి వారి కాళ్లపైబడి, ఏడ్వసాగాడు. దూరం నుండీ కారెక్కుతూ ఈ దృశ్యం చూసిన కలెక్టర్ చిరునవ్వుతో సాగిపోయారు.





# చేతి కడియం

బంగారయ్య వడ్డీ వ్యాపారి. ఆయన నివసించే రావిపాలెం వాళ్ళే కాక, ఆ చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళు కూడా, అప్పు కోసం బంగారయ్య దగ్గరకు వస్తుండేవాళ్ళు. నగలుగానీ, లేక ఏవైనా వస్తువులుగానీ తాకట్టు పెట్టుకుని, వాటి విలువనుబట్టి ఆయన అప్పులిస్తూండేవాడు.

బంగారయ్య దగ్గిరకు తరచుగా అప్పు కోసం వచ్చేవాళ్ళలో, వీరన్న ఒకడు. వీరన్న చాలా సామాన్యమైన రైతు. ఇంటి అవసరాలకూ, పొలం పనులకూ అతడు బంగారయ్య దగ్గిర అప్పు చేస్తుండేవాడు. అప్పుకు వచ్చినప్పుడల్లా, వీరన్న తన చేతికున్న బంగారు కడియాన్ని తాకట్టు పెట్టి, యాభై వరహాలు తీసుకుపోతూండేవాడు. డబ్బు రాగానే, ఆ యాభై వరహాలూ వడ్డీతో సహా బంగారయ్యకిచ్చి, తన కడియాన్ని తీసుకుపోతుండేవాడు. ఒకసారి వీరన్న, బంగారయ్య దగ్గిరకు అప్పుకోసం వచ్చినప్పుడు, సమయానికక్కడ వీరేశం అనే బంగారు వస్తువులు చేసే అతనున్నాడు. వీరన్న తనకు యాభై వరహాలు అప్పు కావాలని చెప్పి, బంగారయ్యకు తన చేతి కడియాన్ని ఇచ్చాడు. బంగారయ్య డబ్బు లెక్క చూసి అతడికిచ్చి పంపేశాడు.

వీరన్న చేతికడియాన్ని వీరేశం పరీక్షగా చూశాడు. ఆ చేతి కడియం చాలా నాసిరకంగా బంగారంతో చేసినది. పట్టుమని పది వరహాల విలువ కూడా చెయ్యదు!

ఎవరినీ ఒక పట్టాన నమ్మని బంగారయ్య, వీరన్న విషయంలో ఇంత పొరబాటెలా చేశాడని వీరేశం ఆలోచించ సాగాడు.

రాంబాబు

వీరన్న ఇచ్చినది మంచి బంగారపు కడియం కాదని, బంగారయ్యకు చెప్పకుండా, తను వచ్చిన పని ముగించుకుని, వీరేశం వెళ్ళి పోయాడు. అతడికి, బంగారయ్యకు నాణ్యత గురించి బొత్తిగా తెలియదన్న నమ్మకం కలిగింది.

ఆ తర్వాత నెల రోజులకు, వీరేశం నాసి రకం బంగారంతో నాలుగైదు రకాల వస్తువులు చేసి, వాటిని బంగారయ్య దగ్గిరకు తీసుకుపోయి, 'బంగారయ్యగారూ! మా చిన్నమ్మాయికి పెళ్ళి సంబంధాలు వస్తున్నవి. అదీకాక, నేను అద్దె దుకాణం వదిలి, సొంత దుకాణం కట్టించాలనుకుంటున్నాను. అందుకు నాకు వెయ్యి వరహాల సొమ్ము కావాలి. ఈ బంగారు నగలు తాకట్టుగా ఉంచుకుని, నాకు సొమ్మివ్వండి,' అన్నాడు.

బంగారయ్య, వీరేశం తెచ్చిన నగలను పరీక్షగా చూసి పెదవి విరిచి, 'వీరేశం! నువ్వు బంగారం, వెండి నగలు చేసే వృత్తిలో జీవిస్తున్నవాడివి. అటువంటి నీకు బంగారం గురించిన మంచి చెడ్డలు తెలియవనుకోమంటావా?' అని అడిగాడు.

వీరేశం, 'మీరనేదేమిటో, నాకు తెలియడంలేదు,' అన్నాడు.

ఆ మాటలకు బంగారయ్య చిన్నగా నవ్వి, 'ఈ వస్తువులన్నీ నాసిరకం బంగారంతో చేసినవి. ఒకవేళ ఇటువంటి బంగారంతో, మీ చిన్నమ్మాయి నగలు చేసి అత్తవారింటికి పంపావో, గొడవలు రాగలవు.



సరే, ఈ వస్తువులు తాకట్టు పెట్టుకునేందుకు నాకభ్యంతరం ఏమీ లేదు. అయితే, వీటికి నీకు ఐదువందల వరహాలకన్నా ఎక్కువ ఇవ్వలేను,' అన్నాడు.

వీరేశం ముఖం చిన్నబుచ్చుకుని, 'ఒకే గ్రామంవాణ్ణి. మిమ్మల్ని మోసపుచ్చ చూస్తున్నానని ఎందుకనుకుంటున్నారు? ఒంటరి వాణ్ణి కాదు; పిల్లలు గలవాణ్ణి. గ్రామం వదిలి పారిపోలేను గదా! నాసిరకం బంగారం అంటున్నారు, బావుంది. మీరు ఇదే రకం బంగారంతో చేసిన వీరన్న చేతి కడియానికి యాభై వరహాలిస్తున్నారు. నా సంగతి వచ్చేసరికి, నాసిరకం బంగారం అంటున్నారు,' అన్నాడు. బంగారయ్య ఒకటి, రెండు క్షణాలు తలాడిస్తూ ఊరుకుని, తర్వాత

'నువ్వు చాలా గట్టివాడివయ్యా, వీరేశం! వీరన్న నాకు చేతి కడియం తాకట్టు పెడుతుండగా, సమయానికి ఆ రోజున వచ్చావు. ఆ కడియాన్ని పరీక్షగా చూశావన్నమాట. అవునా?' అని అడిగాడు. వీరేశం అవునన్నట్టు తలాడించాడు.

బంగారయ్య చిన్నగా చిటికవేసి, 'వీరన్న చేతికున్న బంగారు కడియం, మంచి బంగారంతో చేసినది కాదని, నాకు మొదటి నుంచీ తెలుసు' అన్నాడు నవ్వుతూ. 'మరి, తెలిసీ దాన్ని తాకట్టు పెట్టుకుని అంత మొత్తం అప్పుగా ఎలా ఇస్తున్నారు?' అని అడిగాడు వీరేశం.

'వీరన్న విషయంలో నేను మనిషిని నమ్మాను, అతడి వస్తువును కాదు, అతడు చాలా నిజాయితీపరుడు. అతడి విషయంలో నేను, ఏ తాకట్టు లేకుండా అప్పు ఇవ్వదలిచాను, అయినా అతను ఒప్పుకోలేదు. ఆ కడియాన్ని తాకట్టు పెట్టిగానీ, నానుంచి డబ్బు తీసుకోడు,' అన్నాడు బంగారయ్య. ఆ జవాబుతో వీరేశం కాస్త తేరుకుని, 'స్నేహితుడంటున్నారు- అలాంటప్పుడు మీరు, వీరన్నకు అది నాసిరకం బంగారంతో చేసిన కడియం అని చెప్పక పోయారా?,' అన్నాడు.

'అందువల్ల జరిగే మేలేమిటి? ఆ కడియం ఇరవై వరహాల విలువ కూడా చేయదని నాకు తెలుసు. కానీ ఆ మాట వీరన్నతో అంటే, ఇక తర్వాత ఎంత అవసరం కలిగినా నా దగ్గిరకు అప్పుకు రాడు. ఎవడో మోసబుద్ధి అతడి దగ్గిర వంద వరహాలు తీసుకుని, ఆ కడియం అంటగట్టాడు,' అన్నాడు బంగారయ్య.

బంగారయ్యలో వీరన్నపట్ల ఉన్న అభిమానానికి ఆశ్చర్యపోయి, వీరేశం తను చేసిన పనికి సిగ్గుపడుతూ, తను తెచ్చిన నాసిరకం బంగారు నగలను తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.



# కెరీర్ అంటే?



ఈ నెల మనం ఫిజియోథెరపీ -భౌతిక చికిత్స- అంశంకేసి చూద్దాము. అయవవాల కదలికలను మెరుగుపర్చడానికి, మానవ శరీర విధులను, ఆరోగ్యాన్ని ప్రోత్సహించడానికి, ఉపయోగపడే శాస్త్రమే ఫిజియోథెరపీ. మానవ శరీర విధులు, అవయవాల పనితీరును ఇది నిర్వహిస్తుంది, అంచనా వేస్తుంది, పునపుద్ధరిస్తుంది. శారీరక వైకల్యం కలిగిన వారికి, కీళ్లవాతం మరియు మానసిక వైకల్యాలు కలిగిన వారికి, క్రీడాకారులకు, ఉద్రిక్త స్వభావం కలవారికి ఫిజియోథెరపీ మేలు చేస్తుంది. ఇది నోటి ద్వారా తీసుకునే ఔషధాలతో పాటు రోగ చికిత్స, అనుబంధ చికిత్సా విధానంగా ఉపయోగించబడుతుంది. ఉష్ణ రేడియో ధార్మికత, మసాజ్‌లు, జలవైద్యం, లాగుడు, దేహకణాలలో వేడి పుట్టించుట వంటి వాటితో ముడిపడి వేగంగా ఎదుగుతున్న వైద్య విభాగాల్లో ఫిజియో థెరపీ ఒకటి.

వృద్ధ వైద్యశాస్త్రం, క్రీడా ఫిజియోథెరపీ, శిశు వైద్యశాస్త్రం, అంగవికలుర చికిత్సాశాస్త్రం, విద్యుత్ భౌతిక చికిత్సా శాస్త్రం, గుండె-ఊపిరి తిత్తుల చికిత్సా శాస్త్రం వంటి పలు ప్రత్యేక వైద్య విభాగాలు ఈ రంగానికి సంబంధించినవి. భౌతిక శాస్త్రం, రసాయనశాస్త్రం, జీవశాస్త్రం, ఇంగ్లీష్ పాఠ్యాంశాలుగా తీసుకుని ఇంటర్మీడియట్ లేదా తత్సమాన పరీక్షలో ఉత్తీర్ణత సాధించిన సైన్స్ విద్యార్థులు ఫిజియోథెరపీలో కెరీర్‌ని ఎంచుకోవచ్చు. బీఎస్సీలో ఫిజియోథెరపీ, మాస్టర్ ఆఫ్ ఫిజియోథెరపీ, బ్యాచులర్ ఆఫ్ ఫిజియోథెరపీ, న్యూరాలజీలో మాస్టర్ ఆఫ్ ఫిజియోథెరపీ, అంగవికలురకు చికిత్సా శాస్త్రంలో మాస్టర్ ఆఫ్ ఫిజియోథెరపీ వంటి పలు కోర్సులను ఈ విభాగం నుంచి ఎంచుకోవచ్చు.

భారతదేశంలో అనేక క్లినిక్కులు, ఆసుపత్రులు, ఆరోగ్య శాఖలు, ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌లు, పునరావాస కేంద్రాలు పిజియోథెరపీలో నిష్ణాతులను చేర్చుకుంటున్నాయి. ఇంకా ప్రైవేట్ ప్రాక్టీసు చేస్తూ కూడా వీరు స్వయం ఉపాధిని పొందవచ్చు.

ఫిజియోథెరపీలో కోర్సులను ప్రతిపాదిస్తున్న సంస్థల జాబితాను వచ్చే నెల సంచికలో చూద్దాము.

- సాయి



# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 26

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 26 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. జూన్ 2011 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారత దేశ విశేషాలు




1. పెళ్లి సమయంలో 13 రూపాయలకు మించి సాంప్రదాయికంగా ఖర్చుపెట్టకూడని సామాజిక బృందాన్ని పేర్కొనండి.
2. ఆధునిక భారతదేశంలోని ఏ భాగాన్ని పురాణాల్లో 'కొండ' అని పిలిచేవారు?
3. ఎలాంటి మార్పులేకుండా స్తబ్దతగా ఉన్న డెల్టాను కలిగిన రెండు భారతీయ నదులను పేర్కొనండి.
4. కుమారగుప్తుడు, అతడి కుమారుడు స్కంథ గుప్తుడి కాలంలో నివసించిన ఖగోళ శాస్త్రజ్ఞుడు, గణిత శాస్త్రజ్ఞుడు ఎవరు?
5. లుడో 1880లో ఇంగ్లీషు క్రీడగా పేటెంట్ చేయబడింది. కాని వాస్తవంగా ఇది భారతీయ పదం నుంచి పుట్టింది. దాని పేరు చెప్పండి.
6. కొల్‌కతాలోని ఏ శివారు, సాంప్రదాయికంగా దుర్గ పూజా ప్రతిమల తయారీదార్లకు నిలయంగా ఉంటోంది?

### చందమామ లోకజ్ఞానం క్విజ్-24 జనవరి 2011 సమాధానాలు

1. ఎనిమిది (ప్లూటో 8వ గ్రహంగా పరిగణించబడలేదు) 2. బుధుడు 3. సూర్యుడు 4. పాదరసం 5. అంగారక గ్రహం 6. ఇది పొడవాటి తోక కలిగిన గ్రహాంతర వస్తువు 7. ఒలింపస్ మాన్స్ (అంగారక గ్రహంలో) 8. నిజం.

*Jan'11 Winners: 1. S. Siri, Karnataka-571401. 2. Ishita Saxena, Kaanpur-208001. 3. Jeeja Upadhyay, Madhya pradhesh-461228.*



# నవ్వుల పువ్వులు



ఒక మహిళ ఫోన్‌లో డాక్టర్‌తో మాట్లాడుతోంది. ''డాక్టర్ దయచేసి నా బరువును వెంటనే తగ్గించే మందును ఇవ్వండి. నా భర్త నాకు అద్భుతమైన పుట్టినరోజు బహుమతిని ఇచ్చాడు. కాని దాంట్లోకి నేను పోలేకున్నాను.''

డాక్టర్: ''నా క్లినిక్‌కి రండి. నేను మీకు మందులిస్తాను.త్వరలోనే మీరు మీ అద్భుతమైన కొత్త డ్రెస్‌ని ధరించగలరు.''

మహిళ: ''డ్రెస్ గురించి ఎవరు చెప్పారు మీకు? నేను నా కారు గురించి మాట్లాడుతున్నా.''



అమ్మ: మా అబ్బాయి జీవితాన్ని కాపాడారు డాక్టర్‌గారూ, మీకు కృతజ్ఞతలు.

డాక్టర్: మీ జీవితాన్ని ఆ దేవుడే కాపాడాడు లెండి.

కొంత సేపు తర్వాత డాక్టర్ తన ఫీజు అడిగాడు.

అమ్మ: నేను దేవుడికి మనీఆర్డర్ ద్వారా పంపిస్తాను లెండి.



ఒక సైనికుడు పదోన్నతి పొందాడు. యువ సైనికుడి వద్ద డాబు చూపించాలనుకున్నాడు. ఆ యువసైనికుడు గదిలోకి వచ్చినప్పుడు ఇతడు ఫోన్ అందుకుని చెప్పాడు. ''యస్ జనరల్, నేను ఈ విషయాన్ని మధ్యాహ్నం తర్వాత అధ్యక్షుడికి సందేశం ద్వారా పంపుతాను.''

తర్వాత అతడు ఫోన్ కింద పెట్టేసి యువ సైనికుడిని ఏం కావాలని అడిగాడు.

ఆ యువసైనికుడు అన్నాడు. ''మీ ఫోన్‌కి వైర్ తగిలించాలని వచ్చానండీ''

# సుడోకు పజిల్

కింది సుడోకు పజిల్‌ని పరిష్కరించి, మీ పరిష్కారాలను మాకు పంపించండి.
పరిష్కారానికి సూచనలు: ప్రతి వరుసలో 1 నుంచి 9 వరకు అంకెలు అడ్డంగా, నిలువుగా నింపండి. ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరంలోనూ 1 నుండి 9 అంకెలు ఉండాలి. పజిల్‌కు పరిష్కారం జూన్ 2011 సంచికలో ప్రచురించబడుతుంది. సరైన సమాధానాలు పంపిన విజేతల్లో ఒక్కో భాషలో ఒక్కొక్కరికి ₹500/- బహుమతి ఉంటుంది.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 5 | | | 2 | | | 3 | | |
| | | 6 | | | 7 | | | |
| | | | 1 | | 6 | | 2 | 8 |
| 9 | | 7 | | | | 6 | | |
| | | 1 | | | | 9 | | |
| | | | | | | | | 3 |
| | 5 | | 8 | 3 | | | 1 | 2 |
| | | 2 | | | | | | |
| 8 | 3 | | | | | | 9 | |

## Jan'11 Winners

1. K. Saroja,
   Kanchanbagh - 500058.
2. Master A.V. Ritwik,
   Chennai - 600041.
3. Kishori Mohan Das,
   Hooghly - 712235.
4. Srimasish Sarangi,
   Orissa - 759001.
5. Aditya, Gujarat - 380058

మీ ఎంట్రీలను 2011 ఏప్రిల్ 25వ తేదీలోగా పంపించండి. పంపవలసిన చిరునామా:

**SUDOKU PUZZLE, CHANDAMAMA INDIA LTD.,**
Swathi Enclave Nos. 5 & 6, Amman Koil Street, Vadapalani, Chennai-600026.
e-mail your entries to:contests@chandamama.com

జనవరి' 11 సుడోకు పజిల్స్‌కు సరైన పరిష్కారాలు:

పజిల్ - 1

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 6 | 4 | 3 | 8 | 5 | 7 | 2 | 9 |
| 5 | 7 | 2 | 4 | 1 | 9 | 8 | 3 | 6 |
| 3 | 9 | 8 | 6 | 2 | 7 | 5 | 1 | 4 |
| 8 | 4 | 3 | 1 | 9 | 6 | 2 | 5 | 7 |
| 6 | 2 | 1 | 7 | 5 | 4 | 3 | 9 | 8 |
| 7 | 5 | 9 | 2 | 3 | 8 | 4 | 6 | 1 |
| 4 | 3 | 7 | 9 | 6 | 2 | 1 | 8 | 5 |
| 2 | 8 | 6 | 5 | 4 | 1 | 9 | 7 | 3 |
| 9 | 1 | 5 | 8 | 7 | 3 | 6 | 4 | 2 |

పజిల్ - 2

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 3 | 7 | 4 | 1 | 9 | 5 | 6 | 8 |
| 1 | 6 | 4 | 7 | 5 | 8 | 9 | 2 | 3 |
| 9 | 8 | 5 | 3 | 6 | 2 | 1 | 7 | 4 |
| 7 | 5 | 9 | 2 | 8 | 1 | 4 | 3 | 6 |
| 6 | 2 | 3 | 5 | 4 | 7 | 8 | 1 | 9 |
| 4 | 1 | 8 | 9 | 3 | 6 | 7 | 5 | 2 |
| 8 | 4 | 2 | 6 | 7 | 5 | 3 | 9 | 1 |
| 3 | 7 | 6 | 1 | 9 | 4 | 2 | 8 | 5 |
| 5 | 9 | 1 | 8 | 2 | 3 | 6 | 4 | 7 |

# స్ట్రా తరంగాలు

తరంగ చలనాన్ని ప్రదర్శించడానికి సులువైన, తక్కువ ఖర్చుతో కూడిన నమూనా.

## ఏమేం కావాలి?



- 50 ప్లాస్టిక్ స్ట్రాలు
- సెల్లో టేప్
- కత్తెరలు

## తయారు చేయడం ఎలా?



- 1.5 మీటర్ల సెల్లో టేపును నేలమీద పరిచి దాని అంటు కునే భాగాన్ని పైకి కనిపించేలా చేయండి.
- 50 స్ట్రాలను రెండు సెం.మీ దూరంలో అతికించాలి. ఇరువైపులా 5 సెం.మీ టేపును, పట్టుకోవడానికి వీలుండేలా అంటించండి.
- పైభాగంలో ఒక పొడవాటి టేపును అతికించండి. రెండు టేపుల మధ్య స్ట్రాలు శాండిల్ విచ్ ఆకారంలో కనబడతాయి.
- టేపు ఒక కొసను పట్టుకోమని మీ మిత్రుడికి చెప్పి మరొక కొసను నొక్కి ఉంచి ఒకసారి తట్టండి. ఒక తరంగం ఈ టేపుల నుంచి పయనించి మరొక మూల వద్ద ప్రతిధ్వనిస్తుంది.
- టేప్ చివరలను కొన్నిసార్లు తిప్పడం ద్వారా స్థితి తరంగాలను ప్రేరేపించవచ్చు. ఇప్పుడు రెండు కెరటాల పై ఉన్న పల్లాన్ని, తరంగ దైర్ఘ్యాన్ని, పౌనఃపున్యాన్ని స్పష్టంగా చూడవచ్చు.



**కాన్సెప్ట్:** స్ట్రాలను సెల్లోటెపుతో అనుసంధించినందువల్ల స్ట్రాకు ఇవ్వబడిన శక్తి, ఒక తరంగాన్ని రూపొందించి తదుపరి స్ట్రాకు పయనిస్తుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | I am a student. | Where do you work? |
|---|---|---|
| Telugu | నేను విద్యార్థిని. | మీరు ఎక్కడ పనిచేస్తున్నారు? |
| Hindi | मैं एक छात्र हूँ।<br>మైన్ ఏక్ ఛాత్రా హూన్. | तुम कहाँ काम करते हो?<br>తుమ్ కహాఁన్ కామ్ కర్తే హో? |
| Tamil | நான் ஒரு மாணவன்<br>నాన్ ఒరు మానవన్ | நீ எங்கே வேலை செய்கிறாய்?<br>నీ ఎంగే వేలై సెయ్‌గిరాయ్? |
| Bengali | আমি একজন ছাত্র।<br>అమి ఎక్జోన్ ఛాత్రో? | আপনি কোথায় কাজ করেন?<br>అప్ని కొత్తాయ్ కాజ్ కరి? |
| Marathi | मी एक विद्यार्थी आहे.<br>మి ఎక్ విద్యార్థి అహె. | तुम्ही कुठे काम करता?<br>తుమి కుతే కామ్ కర్తా? |
| Kannada | ನಾನು ಒಬ್ಬ ವಿದ್ಯಾರ್ಥಿ.<br>నాను ఒబ్బ విద్యార్థి. | ನೀವು ಎಲ್ಲಿ ಕೆಲಸ ಮಾಡುತ್ತೀರಿ?<br>నీవు ఎల్లి కెలస మాడుత్తేరి? |
| Oriya | ମୁଁ ଗୋଟିଏ ଛାତ୍ର।<br>మున్ గో ఛాత్రా. | ତୁମେ କେଉଁଠାରେ କାର୍ଯ୍ୟ କରୁଛ?<br>తుమె క్యూన్ థారే కారియా కరుచ్చా. |
| Gujarati | હું વિદ્યાર્થી છું.<br>హున్ విద్యార్థి ఛున్ | તમે ક્યાં કામ કરો છો?<br>తమె కయాన్ కామ్ కరో చ్చో? |
| Assamese | মই এজন ছাত্র<br>మోయి ఎజోన్ ఛాత్రా | আপুনি ক'ত কাম কৰে?<br>అపుని కోటె కామ్ కొరె? |
| Malayalam | ഞാൻ ഒരു വിദ്യാർത്ഥിയാണ്.<br>న్యాన్ ఒరు ఫ్యాక్టరియిల్ జోలి చెయ్యున్ను. | നിങ്ങൾക്കെവിടെയാണ് ജോലി?<br>నీంగళ్ ఎత్రామ్ క్లాసిల్ పడిక్కున్ను? |
| Santali | [illegible]<br>ఇన్ఙ్ దో మిడ్ పడాగ్ గిద్రా | [illegible]<br>ఒకరెబిన్ కామి కానా |
| Sanskrit | अहं छात्रः/छात्रा अस्मि ।<br>అహం ఛాత్రాహ/ఛాత్రా అస్మి | त्वं कुत्र कार्यं करोषि ?<br>త్వమ్ కుత్ర కార్యమ్ కరోషి |





| English | I work in a factory | In which class do you study ? |
|---|---|---|
| Telugu | నేను కర్మాగారంలో పనిచేస్తున్నాను | మీరు ఏ తరగతిలో చదువుతున్నారు? |
| Hindi | मैं एक कारखाने में काम करता हूँ।<br>మైన్ ఏక్ కార్ఖానే మే కామ్ కర్తా హూన్ | तुम किस कक्षा में पढ़ते हो?<br>తుమ్ కిస్ కక్షా మె పఢతె హో? |
| Tamil | நான் தொழிற்சாலையில் வேலை செய்கிறேன்<br>నాన్ తొ౹ఝిర్చాలైయిల్ వేలై సెయ్‌గిరేన్ | நீ எந்த வகுப்பில் படிக்கிறாய்?<br>నీ ఎంధా వగుప్పిల్ పడిక్కిరాయ్ |
| Bengali | আমি একটা কর্মশালাতে কাজ করি।<br>అమి ఏక్టా కర్మశాలాతే కాజా కరి | তুমি কোন শ্রেনীতে পড?<br>తుమి కోన్ శ్రేణితే పారో? |
| Marathi | मी एका फॅक्टरीत काम करतो.<br>మి ఎక ఫ్యాక్టరీ కామ్ కరాటో. | तू कोणत्या इयत्तेत शिकतोस?<br>చు కొంట్యా ఇయట్టెట్ షిక్టోస్? |
| Kannada | ನಾನು ಕಾರ್ಖಾನೆಯಲ್ಲಿ ಕೆಲಸ ಮಾಡುತ್ತೇನೆ.<br>నాను కార్ఖానెయల్లి కెలస మాడుత్తేనె. | ನೀನು ಯಾವ ತರಗತಿಯಲ್ಲಿ ಕಲಿಯುತ್ತಿದ್ದೀಯಾ?<br>నేను యావ తరగతియల్లి కలియుట్టిద్దెయా? |
| Oriya | ମୁଁ ଗୋଟିଏ କାରଖାନାରେ କାମ କରୁଛି।<br>మున్ గో టీ కారఖానారే కామ కరుచ్చి. | ତୁମେ କେଉଁ ଶ୍ରେଣୀରେ ପଢୁଛ?<br>తుమ్ క్యూన్ శ్రనేరే పడుఛా |
| Gujarati | હું કારખાનામાં કામ કરું છું.<br>హున్ కారఖానమాన్ కామ్ కరున్ చ్ఛున్. | તમે કયા ધોરણમા અભ્યાસ કરો છો?<br>తమె కాయా ధోరణమాన్ అభ్యాస కరో చ్ఛో? |
| Assamese | মই কাৰখানা এটাত কাম কৰো।<br>మోయి కార్ఖానా ఎటాట్ కామ్ కరో. | তুমি কোন শ্ৰেণীত পঢ়া?<br>తుమి కోనె ష్రేణిత్ పోర్హా? |
| Malayalam | ഞാൻ ഒരു ഫാക്ടറിയിൽ ജോലി ചെയ്യുന്നു.<br>న్యాన్ ఒరు ఫ్యాక్టరియిల్ జోలి చెయ్యున్ను. | നിങ്ങൾ എത്രാം ക്ലാസ്സിൽ പഠിക്കുന്നു?<br>నింగల్ ఎథ్రమ్ క్లాసిల్ పడిక్కున్ను. |
| Santali | [illegible]<br>ఇడ్ కార్గల్ రిఖ్ కామి కానా | [illegible]<br>ఒక చనచ్ రెబిన్ పడాగ్ కానా? |
| Sanskrit | अहं यन्त्रागारे कार्यं करोमि ।<br>అహమ్ యంత్రాగారే కార్యం కరోమి. | त्वं कस्यां कक्षायां पठसि ।<br>త్వమ్ కస్యామ్ కక్షాయామ్ పఠస్ |

## మగవాళ్లు జ్ఞానప్పలు - ఆడవాళ్లు జ్ఞానవ్వలు



కుటుంబంలో ముగ్గురు లేదా నలుగురు పిల్లలకు ఒకే పేరు ఉంటేనే చాలా గందరగోళం చెలరేగడం ఖాయం. అయితే కొప్పల్ జిల్లాలోని గునల్లి గ్రామ వాసులందరూ ఒకే పేరుతో ఉన్నారని విన్నప్పుడు నిజంగా ఆశ్చర్యపోతాము. ఈ ఊరిలో ప్రతిఅబ్బాయి పేరు జ్ఞానప్ప, ప్రతి అమ్మాయి పేరు జ్ఞానవ్వ అనే ఉంటుంది.

ఈ ఊరిలోపెద్దవాళ్లను దొడ్డ అని, చిన్న వాళ్లను చిక్క అని పిలుస్తుంటారు. ఈ గ్రామంలో 200పైగా కుటుంబాలు ఉంటాయి. అన్ని కుటుంబాలలో ఒకే పేర్లు ఉండటం విశేషం. గున్నల్లి గ్రామం నిజంగానే సాంప్ర దాయానికి కట్టుబడి ఉంటోంది. మహర్షి జ్ఞానేశ్వర్ పేరు మీద ఈ ఊరివారికి పేర్లు పెడు తుంటారు. ఇతడి ఆశీర్వాద బలంతోటే తమందరి జీవితాలు శాంతియుతంగా, ఆరోగ్యంగా ఉంటున్నాయని ఇక్కడి వారి విశ్వాసం.

## నిండు నూరేళ్ల విద్యార్థి

వందేళ్ల వయస్సు ఉన్న భోలారాం దాస్ ఇటీవలే డాక్టరేట్ కోసం పేరు నమోదు చేయించు కున్నారు. అస్సాంలోని గవాహతి యూనివర్శిటీలో ఇటీవలే జరిగిన కార్యక్రమంలో దాస్ పీహెచ్‌డీలో చేరారు. ఇటీవలే తన వందవ జన్మదినాన్ని కుటుంబసభ్యులు, మిత్రులు జరిపిన సందర్భంగా బహిరంగ సమావేశంలో దాస్ ఈ విషయం ప్రకటించారు.

బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యోద్యమం కాలంలో 19 ఏళ్ల చిన్న వయస్సులో దాస్ జైలుకెళ్లారు. జ్ఞాన సాధనకు వయస్సు పెద్ద అడ్డంకి కాదని దాస్ విశ్వాసం. వందేళ్లు నిండిన సందర్భంగా దాస్ మాట్లాడుతూ ''ఉపాధ్యాయుడిగా, రాజకీయవాదిగా, న్యాయ వాదిగా, మేజిస్ట్రేట్‌గా పనిచేసి 1971లో జడ్జిగా పదవీ విరమణ చేశాను. వందేళ్ల సంతృప్తికర జీవితం నాది,'' ఈయన ఇప్పటికీ చురుగ్గా నడుస్తుంటారు. టీవీలో క్రికెట్ మ్యాచ్ చూడటం తనకు చాలా ఇష్టం. పుస్తకాలు ఎంతో ఇష్టంగా చదువుతుంటారు. ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉండడం ఈయనకు చాలా ఇష్టం.



# రోదసీ యాత్రికురాలు రూపిణి



రోదసీ యాత్రికురాలు రూపిణి తన రోదసీ వాహనం తప్పిపోవడంతో కలవరపడింది. రోదసీ వాహకనౌకను చేరుకోవడంలో ఆమెకు సాయపడండి.







రూపిణి రోదసీవాహక నౌకను పోలిన మరో స్పేస్‌షిప్ ఇక్కడ ఉంది. అయితే దీనికి రంగుల్లేవు. రంగులద్దడం ద్వారా దాన్ని ఆకర్షణీయంగా మల్చండి.

# తీపి ఇసుక!




కృష్ణదేవరాయలను ఆటపట్టించాలని తెనాలి రామలింగడు అవకాశం కోసం చూస్తున్నాడు. ఒకరోజు, రాజమందిరంలో రాయలు తన సేవకులు చేస్తున్న పనిని పరిశీలిస్తున్నాడు.




వాళ్లు నేలమీద చాప పరిచి దాంట్లో చక్కెర పోసి ఎండకు ఆరబోస్తున్నారు. చక్కెరను మందిరంలోకి తీసుకుపోతున్నప్పుడు అది తడిగా మారుతోంది.




ఆరబోస్తున్నదేమిటని రామలింగడు రాయలను విచారించాడు. రామలింగడి కుయుక్తిని పసిగట్టిన రాయలు అది ఒక ప్రత్యేక తరహా ఇసుక అని చెప్పాడు.




అందుకు, రామలింగడు తలాడించి అక్కడి నుంచి వెళ్లిపోయాడు. వెళుతున్న వాడిని చూసి రాయలు పరమానందంతో నవ్వుకున్నాడు.




రామలింగడిని ఏమార్చిన తీరుగురించి రాయలవారు రాణితో పంచుకున్నాడు. ఈలోగా మందిరం ముంగిట జరుగుతున్న దృశ్యంపై రాణి కన్ను పడింది.




రాయల వారు కూడా అటుకేసి చూశాడు. రామలింగడు, అతడి కుమారుడు నేలమీద కూర్చుని పిడికిళ్ల నిండా చక్కెర నోట్లో పోసుకుంటూ ఆనందంగా ఆరగిస్తున్నారు.




చక్రవర్తి వచ్చి ఏం చేస్తున్నావంటూ రామలింగడిని కోపంగా ప్రశ్నించాడు. ఇంట్లో ఎనుము చనిపోయినందుకు సంతాపం తెలుపుతున్నట్లు రామలింగడు చెప్పాడు.




విషాదాన్ని వ్యక్తపరచడానికి ఇసుకను నోట్లో పోసుకుని తినడం ఆచారమని తెనాలి రామలింగడు చక్రవర్తికి వివరించాడు.




రాయలవారు పక్కున నవ్వి రామలింగడికి, అతడి కుమారుడికి తీపి పదార్థాలను ఇప్పించాడు.

## హాస్య చిత్రం









# నిధిపెట్టె

ఈ నెల మీ ఆల్బమ్ కోసం అడవి జంతువుల చిత్రాలను ఇస్తున్నాము.

ఎలుగుబంటి



నీటి ఏనుగు



గుంటనక్క



సింహం



కంచరగాడిద



అడవి దున్న



